# పౌరుడు - రాజ్యాంగము

రచన:

ఎమ్. రత్నస్వామి, ఎమ్. ఏ. (కాంటబ్), బార్-ఎట్-లా

అనువాదం:

ఎమ్. ఎస్. ప్రకాశరావు, ఎమ్. ఏ., ఎమ్ లిట్.

త్రివేణీ పబ్లిషర్సు

మచిలీపట్టణము

రు. 1

# పరిచయం

దక్షిణభాషా పుస్తక సంస్థవారు ప్రోత్సహించిన ఉత్తమ గ్రంథ సంచయములోని తొలి ప్రచురణలివి. తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం — నాలుగు దక్షిణాది భాషలలో విద్యా సాంస్కృతిక వికాసా లకు దోహదమిచ్చే ఉత్తమ గ్రంథాలను చౌకగా ప్రచురింపచేయాలనే సత్సంకల్పంతో, సముదార దూరదృష్టితో ఫోర్డు ధర్మనిధివారు ఈ సంస్థ నిర్మాణాన్ని తలపెట్టారు. ఇందుకోసం వారు దక్షిణదేశంలో ఉన్న ఏడు విశ్వవిద్యాలయాల ఉపాధ్యాయులతోను సంప్రదించి ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలకు, మంచి మంచి పుస్తకాలను, ప్రచురణ కర్తలచే అందంగా అచ్చువేయించి అందరికి అందుబాటులో ఉండే సరస మైన ధరలకు అందచేయాలనే ఆదర్శంతో మూడేళ్ళ కార్యక్రమాన్ని రూపొందించారు. వీరి కృషివలన మనకు లభించిన ప్రథమ ఫలాలివి. దీన్ని కూర్చడంలో వీరు ప్రౌఢశైలిలో ఉండే విద్వత్కావ్యాల జోలికి పోకుండా కేవలం మాతృభాషలో మాత్రమే అక్షరాస్యులైన, ఆంగ్ల భాషావాసన లేని అసంఖ్యాక సామాన్యప్రజానీకాన్ని అలరించి, ఆక ర్షించి, వారికి విజ్ఞానాన్ని, వినోదాన్ని, వికాసాన్ని పూర్తిగా అందించ గల సులభసుందర శైలిలో ఉన్న ఉత్తమ గ్రంథాలను మాత్రమే ఎన్ను కున్నారు.

ఉన్నత సారస్వతశ్రేణికి చెందిన స్వతంత్ర రచనలనే కాకుండా వైజ్ఞానిక, సాంస్కృతిక గ్రంథాలనూ, ప్రపంచ సారస్వతంలోని ఉత్తమ గ్రంథాల అనువాదాలనూ కూడా ప్రచురింపచేయడం వీరి ప్రధాన లక్ష్యం.

ఒక్కమాటలో చెప్పాలంటే 'ఉత్తమ గ్రంథాలను చౌకగా అందించడం' అనేది దక్షిణభాషా పుస్తక సంస్థవారి పరమాశయం. ఇందులో వీరెంతవరకు కృతకృత్యులైనది ఇప్పుడీ గ్రంథాలను బట్టి ప్రజలే నిర్ణయించవలసి ఉంది. ఇప్పుడు ప్రారంభమైన ఈ కృషి ఫలితం బహుశా వచ్చే పది సంవత్సరాల వరకు అంతగా కనబడకపోవచ్చు. కాని ఈ ప్రణాళిక అద్భుతమైనదని అత్యంత ప్రధానమైనదని మాత్రం దూరదృష్టి గలవారందరూ ఒప్పుకొనక తప్పదు. ఇందుకుగల అవకాశాలు అనేకం.

అందమైన ముద్రణలో చౌకగా అందరికీ అందుబాటులో ఉండే ఈ ఉత్తమ గ్రంథాలు దేశంలో మారుమూల గ్రామాలలో నివసించే లక్షలాది స్త్రీ పురుషులందరి జీవితాలకు కొత్త వెలుగునీ, విజ్ఞానాన్నీ అందించగలవు.

దక్షిణ భాషా పుస్తక సంస్థవారి కార్యక్రమాలు ప్రస్తుతానికి తమిళం, తెలుగు, మలయాళం, కన్నడం — నాలుగు దక్షిణాది భాషలకే పరిమితమై ఉండడం చింతిస్తాను. ప్రాచీనకాలంలో వింధ్యకు దక్షిణాన ఉండే దేశమంతా దక్షిణాపథమనే పేరుతో వ్యవహారంలో ఉన్నప్పటికీ, సాంస్కృతికంగా ఇక్కడ నివసించే ప్రజలందరూ ఈ నాలుగు భాషలనూ వాటి ప్రాంతీయ వికృతులను మాత్రమే వాడుక చేసేవారు. నిజానికి ఈ నాలుగు భాషలున్నూ ఒకే తావకు చెందినవి. వీటిని 'ద్రావిడ' భాషలనడం నా అభిమతం కాదు. ఈ రోజుల్లో 'ద్రావిడ' పదం జాతి, భాషా పరమైనవిగా కాక ప్రత్యేకమైన రాజకీయ ప్రాధాన్యాన్ని సంతరించుకోవడమే నా యీ సంకోచానికి కారణం. ఈ నాలుగు భాషలను మధ్య సహజమైన సన్నిహిత సంబంధాలు చాలా ఉన్నవి. పైగా ఆర్యావర్తంలో వ్యాప్తిలో ఉన్న సంస్కృతికంటె భిన్నమైన దక్షిణ భారతీయ సంస్కృతికి ఈ ప్రాంతం ఆటపట్టు. కర్ణాటక సంగీత సంప్రదాయం ఇక్కడిదే. అలాగే ఇక్కడి వాస్తు, శిల్ప సంపద ఉత్తరాది దానికంటె భిన్నమైనది. ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలు అనూచానంగా అనుసరించే సాంఘికాచార వ్యవహారాలన్నీ కూడా ఒక్కటే.

దక్షిణ భాషా పుస్తక సంస్థవారి ప్రోత్సాహంవల్ల ప్రచురితమయ్యే పుస్తకాలన్నీ దాక్షిణాత్య సంస్కృతిని ప్రతిబింబించేవిగా ఉండగలవని ఆశిస్తున్నాను. అయితే సంకుచితమైన స్వస్థాన భాషా వేషానురతి శ్రుతి మించిపోకుండా సమగ్ర భారతి సంస్కృతిని ప్రతిబింబింప జేసే పుస్తకాలను, విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని, ప్రపంచ కల్యాణాన్ని కాంక్షించే ఉత్తమ గ్రంథాల అనువాదాలను ప్రచురించడం చాలా అవసరం.

—పా. వేం. రాజమన్నాగు

# తొలిపలుకు

స్వాతంత్ర్యాన్ని సంపాదించిన తరువాత మనం సాధించిన మొదటి విజయాలలో ఒకటి ఇండియా రాజ్యాంగ నిర్మాణం. నిజానికి, మన సంస్కృతి స్వరూపానికే ప్రతిబింబం.

ప్రపంచంలో వేర్వేరు రాజ్యాంగాలను శ్రద్ధగా పరిశీలించి ఇండియా పరిస్థితులకనుగుణ్యంగా ఇప్పటి ప్రజాతంత్రానికి తగినట్లుగా ఆ రాజ్యాంగాలలోని విశేషాలను పొందుపరుస్తూ మన రాజ్యాంగ నిర్మాణ సభ ఇండియాకు ఒక రాజ్యాంగాన్ని తయారుచేసింది. ఆ సభ ప్రథమ సమావేశం 1946 డిసెంబరు 9 తారీకున జరిగింది. 1949 నవంబరు 26 తారీకున రాజ్యాంగ రచన పూర్తి అయింది. పూనుకున్న పనిలో గొప్పతనాన్ని, ఎదురై కలిగివచ్చిన కష్టాలను, సాధించిన విజయాన్ని గమనిస్తే రాజ్యాంగ నిర్మాణ సభ చాలా స్వల్పకాలంలో తన కర్తవ్యాన్ని పూర్తిచేసిందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

న్యాయము, స్వేచ్ఛ, సమత్వము, సౌభ్రాతృత్వము మన నూతన ప్రజాప్రభుత్వానికి నాలుగు మూలస్తంభాలని రాజ్యాంగంలోని ఉపోద్ఘాతం వల్ల స్పష్టపడుతున్నది.

ఇండియాలోని పౌరులందరు స్వేచ్ఛగాను శాసనబద్ధంగాను ప్రకటించిన అభిప్రాయం మీద ఆధారపడిన ప్రజారాజ్యంగా ఇండియా రూపొందాలి అన్నదే మన రాజ్యాంగానికి అసలు ప్రాతిపదిక. కచ్చితంగా చూచినట్లు ప్రజారాజ్యాన్ని నిర్వచించడం కష్టం. అయితే, ప్రభుత్వానికి సంబంధించిన వ్యవహారాలలో ప్రజాభిప్రాయం పని చేస్తున్నప్పుడున్నూ, అర్హతగల పౌరులలో అధిక సంఖ్యాకులు ప్రభుత్వయంత్రాన్ని నియమించగలిగినప్పుడున్నూ, నడపగలిగినప్పుడున్నూ ప్రజాప్రభుత్వం ఉన్నట్లు మనం గ్రహించ

గలం. ఫ్రెంచి విప్లవం జరిగిన కాలంలో ప్రజాప్రభుత్వానికి రాజకీయమైన సాంఘికమైన ప్రాధాన్యం ఏర్పడింది. రష్యావిప్లవం ఆర్థికవిషయం మీద దృష్టిని కేంద్రీకరించింది. మన ప్రజాప్రభుత్వం సాంఘిక రాజకీయ ఆర్థిక రంగాలన్నింటికిన్నీ ప్రాధాన్యమిస్తున్నది.

ప్రజాప్రభుత్వంయొక్క విజయం అందరి సామాన్యపౌరుని శక్తిశీలాల మీదనే కాకుండా విషయపరిజ్ఞానం కలిగిన ప్రజాభిప్రాయం మీదకూడా ఆధారపడి ఉంటుంది. దీనినిబట్టి, ప్రజలు రాజ్యాంగం క్రింద తమ విధులను బాధ్యతలను గ్రహించడానికి సమర్థులను చేయగల విద్యను గడించటం ఆవశ్యమని తేటపడుతున్నది.

శిష్ట పరిపాలనం, ఏకరాజాధిపత్యం, నియంతృత్వం, ప్రజాప్రభుత్వం ఈ విధంగా మానవసభ్యత ప్రారంభమైన నాటినుంచి వేర్వేరు దేశాలలో వేర్వేరు ప్రభుత్వపద్ధతులు అమలులో పెట్టబడినవి. ప్రభుత్వ పద్ధతులలోనూ, పౌరసత్వాన్ని గూర్చిన అభిప్రాయాలలోనూ ప్రస్తుత శతాబ్దంలో విప్లవాత్మకమైన మార్పులు జరిగినవి. ప్రజాప్రభుత్వమంటే అవివేకులపరిపాలనమనీ, హానికరమైందనీ కొందరు భావిస్తున్నారు. అయితే, ఎన్నిలోపాలు ఉన్నా ప్రజాప్రభుత్వానికి బదులుగా వేరొకటి లేదు. 'ప్రజాప్రభుత్వంలో దానిపై ఆరోపించబడే దోషాలన్నీ ఉండవచ్చు. కాని, దానిలో ఒక గొప్ప గుణం ఉన్నది. మొత్తంమీద ప్రజలు అంతర్యుద్ధాలకు రాజకీయ పోరాటాలకు బదులుగా ప్రజాప్రభుత్వాన్ని స్వీకరించడానికి ఇష్టపడతారు. మానవుడు తన బుద్ధికుశలతతో నిర్మించగలిగినది, దానికంటే ఉత్తమమైన ప్రభుత్వపద్ధతి వేరొక్కటి లేదు' — అన్న బెర్‌ట్రండ్ రస్సెల్ వాక్యాలు గమనించతగ్గవి.

ప్రజాప్రభుత్వం వ్యక్తిస్వాతంత్ర్యాన్ని పవిత్రంగానూ అనుల్లంఘనీయంగానూ భావిస్తుంది. సామాన్య ప్రజల క్షేమాన్ని

పెంపొందించడమే తన ప్రథమ కర్తవ్యంగా పాటిస్తుంది. తక్కిన ప్రభుత్వ పద్ధతులన్నీ — ముఖ్యంగా అధికారిక స్వరూపం కలవి — చాలావరకు పశుబలం మీద ఆధారపడి ఉంటవి. వ్యక్తిస్వేచ్ఛను హక్కులను భంగపరుస్తవి. ప్రజాప్రభుత్వ విషయంలో ఈ వ్యత్యాసం చాలా ముఖ్యమైంది.

ప్రజాప్రభుత్వ సూత్రాలను స్పష్టంగాను సక్రమంగాను అర్థంచేసుకొని రాజ్యవ్యవహారాలలో వాటిని ధైర్యంగా వర్తింపజేయడం మీదనే మన రాజ్యాంగం యొక్క స్థిరత్వం ముఖ్యంగా ఆధారపడిఉంటుంది. ఈ విషయంలోనే రాజకీయవేత్త తన పాత్రను నిర్వహించాలి. రాజకీయవేత్తను తెలివిగల అవకాశవాదిగా ఈసడింపుతో పదేపదే వర్ణిస్తూఉంటారు. 'నిజమైన ప్రజాప్రభుత్వంలో దాని సూత్రాలకు కట్టుబడిన రాజకీయవేత్త విజ్ఞానిగాను శిల్పిగాను తత్వజ్ఞుడుగాను వర్తమానంలో నిలబడి భవిష్యత్తుకు దారితీస్తాడని మనం జ్ఞాపకముంచుకోవాలి. వాస్తవిక పరిస్థితిని గూర్చిన పరిజ్ఞానము విమర్శ వీటివల్లనే కాకుండా తాత్విక దృష్టితో ఒక లక్ష్యాన్ని నిర్వచించుకోవడం వల్లనూ, ఉపజ్ఞ వల్లనూ, జ్ఞానంమీద ఆధారపడిన ఊహాకల్పన వల్లనూ, రాజకీయవేత్త ఏది తాత్కాలిక లక్ష్యమో ఏది పరమ లక్ష్యమో విచక్షణ చేయగలిగి ఉండాలి.' (ప్రజాప్రభుత్వం — నేడు — రేపు — ఎడ్వర్డు చిన్)

ప్రజాప్రభుత్వం సమర్థంగా నడవాలంటే రాజకీయపక్షాలు ఉండడం అగత్యమే — కాని పాక్షిక భావం మనదృష్టిని పరిమితం చేస్తుంది. స్వతంత్ర నిర్ణయాన్ని భంగపరుస్తుంది. పక్షావసరాలనబడే వాటికిన్నీ రాజ్యం క్షేమానికిన్నీ సామరస్యంగా సర్దుబాటు చేసుకోవడం పలుమారు మనలను ఎదుర్కొంటూండే సమస్య.

స్వాతంత్ర్యం సిద్ధించడమూ, వయోజనులందరికి ఓటు హక్కు యేర్పడడమూ ఇండియా పౌరులకు తప్పనిసరిగా రాజకీ

యాలలో తీవ్రమైన అభిరుచిని కల్పించినని. ప్రతి పౌరుడు — తనకు శాసనసభలతోగాని, ఇతర ప్రజాసంస్థలతోగాని ప్రత్యక్ష సంబంధం ఉన్నా లేకపోయినా దేశవ్యవహారాలు ఎలా నిర్వహించబడుతున్నదీ తెలుసుకోవాలి. వ్యక్తి హక్కులేవో తెలుసుకోవాలి. నిజానికి మన రాజ్యాంగంలోని ముఖ్యవిషయాలను ప్రతిపౌరుడు తెలుసుకోవాలి.

సులభమైన సుగ్రాహ్యమైన భాషలో ఆచార్య రత్నస్వామి రచించిన (రత్నస్వామిగారి ఆంగ్లమాతృకకు ఈ పుస్తకం ఆంధ్రానువాదం) ఈ చిన్న గ్రంథం ఈ విషయంలో మిక్కిలిగా ఉపకరిస్తుంది. వ్యక్తులమధ్య సమత్వాన్ని, వారి ప్రాథమిక హక్కుల అనుల్లంఘనీయతను ప్రతిపాదించడంలో ముఖ్యంగాను, రాజ్యాంగానికి చెందిన ఇతర విషయాలను, ఈ గ్రంథకర్త విమర్శించారు. మన రాజ్యాంగ స్వరూపాన్ని తెలుసుకోవాలన్న కోరికగల ప్రతి వ్యక్తీ ఈ గ్రంథానికి స్వాగతం చెప్పకపోడు. ఇది సకాలంలో వెలువడిన ప్రచురణం.

"మాతృభూమి"
కోజికోడ్
19-4-1957

కె. పి. కేశవ మీనన్

# పౌరుడు - సంవిధానము

## సంవిధానపు తత్వము

సంవిధానము* (కాన్‌స్టిట్యూషను) ఏ ప్రజలయొక్క ప్రభుత్వమునకైనను మూలాధారమగు చట్టమని సుప్రసిద్ధ అమెరికను రాజ్యతంత్రశాస్త్రజ్ఞుడైన బ్రైస్ వ్రాసియున్నాడు. ఎడ్మండ్ బర్కు చెప్పినట్లు ప్రభుత్వమనునది మానవుల అక్కరలను తీర్చుటకు మానవజ్ఞానము నిర్మించిన సాధనము. ఇండియా సంవిధానము ఇండియా ప్రజల ప్రభుత్వమునకు మూలాధారమగు చట్టము. సంవిధానసభలో (కాన్‌స్టిట్యూయెంటు ఎసెంబ్లి) మన దేశమందలి ప్రతినిధులు ఆ ప్రజలయొక్క అక్కరలను తీర్చుటకై దానిని ఏర్పాటు చేసిరి.

మనలను, మన సంస్థలను పాలకులయొక్కగాని పాలితులయొక్కగాని చపలచిత్తముచే పడరాక, చట్టప్రకారముగా పరిపాలించుకొను స్వతంత్రప్రజలమై యుండవలయునన్న, మనము తప్పనిసరిగా సంవిధానమును శిరసావహించవలయును; దానిని బలపరచ

* రాజ్యాంగమునకు పర్యాయపదము.

[illegible]; కానిక విదేశ [illegible] మనము [illegible] కాపాడుచు [illegible] ఉంచుచూ పూజించుచుందుము. ఎందుకనగా, స్వతంత్రదేశముల ప్రజలయొక్క సంవిధానము లన్నింటిలోనూ ఇండియా సంవిధానము [illegible] మనము. వ్యక్తి జీవితమునకు — సుఖము, శాంతము, లేక [illegible] వృద్ధి. వీటి కంతటికిని పంచసూత్రముల బుద్ధికి [illegible] కాక ప్రియమైన చట్టసహాయముగా [illegible] వీలొసంగుచున్నది. అంతేగాక, ఇండియా సంవిధానము పాలక పాలితుల యొక్క హక్కులను, ధర్మములను శాసించుచున్నది; అధికారమును అనేక సంస్థలకు పంచి యిచ్చుచున్నదే కాని, నిరంకుశప్రభుత్వములోవలె నున్నట్లు, ఏ ఒక్కరిచేతిలోను దానిని కేంద్రీకరించదు. ఏయొక సంస్థయైనను నిరవధికమైనశక్తులను చెలాయించ కుండునట్లు, సంస్థలయొక్క శక్తులను నిర్వచించి పరిమిత ములుగా చేయుచున్నది; వాటిమధ్యగల సంబంధము లను క్రమబద్ధము చేయుచున్నది. మనుజులుకాని, సంస్థలుకాని ప్రతియొక్కరికిని వారెంతవరకు తమ స్వేచ్ఛను అనుభవించుచు పోవచ్చునో, ఎక్కడ మీర మీరరాదో తెలియజేయుచున్నది. ఇదంతయు ప్రజలయొక్క హితవుకొరకే.

ప్రస్తుతము మన సంవిధానముగూర్చి తెలిసి కొందము. దానియొక్క ముఖ్యాంశములను గ్రహిం

తము. పౌరులమగు మనకు అది ప్రాణావసరమగు కార్యము. ఈ సంవిధానము ప్రకారముగానే మనము పాలింపబడుచున్నాము. మన లౌకిక వ్యవహారము లన్నియు జరుగుచున్నవి. మన నిమిత్తమై పరిపాలన చేయుటకుగాను సర్కారువారికి మనము చెల్లించు పన్నులు విధింపబడుచున్నవి. బహిరంగముగాను, పరోక్షముగాను మన జీవితమును శాసించుచున్న విధులు* (Laws) పాలితములై, ఆచరణీయములుగా అమలు జరుపబడుచున్నవి. మరియు ఈ సంవిధానము ననుసరించియే మనమంత్రులును, అధీన అధికారులును (సబార్డినేటు అఫీషియల్సు) రాజ్యముయొక్క వ్యవహారములను నిర్వహించుచున్నారు. ఈ విధముగా సంవిధానము మన వ్యవహారములో జోక్యము కలుగ జేసుకొనుచున్నదనియు మన హృదయసన్నిధికి జేరు చున్నదనియు ననవచ్చును. పౌరులము కనుక మన క్షేమముకొరకే సంవిధానము అనగా నెట్టిదో కనీసము దాని ప్రధాన నియమములు, నిబంధనలు ఎట్టివో మనము తెలిసికొనవలసి యున్నది. ఎందు కనగా, ఈ పరిపాలనా వ్యవహారములో మన స్థానము ఎట్టిదో, మనరాజకీయపు బాధ్యతలు, హక్కు లెట్టివో, ఎంతవరకు సర్కారు మన జీవితములను శాసించుచు

*విధి—'లా' 'శాసనము'

పోవచ్చునో, ఎట్లు అది నిర్ణయమైన మార్గముల ద్వారా, క్రమపద్ధతిని ఏర్పాటు చేసిన సాధనముల చేత మాత్రమే పని చేయవలసియున్నదో, ఎట్లు లోకవ్యవహారములలో ఇచ్చవచ్చిన రీతిని సంచరించుటకు వీలు లేదో— మనము తెలుసుకొనవలసియున్నది. కారణమేమన, సంవిధానము ఒక విధి (లా) అనియు, దానికి సర్కారు, పౌరుడు కూడ బద్ధులై యుండవలయుననియు జ్ఞప్తియుం డుంచుకొనవలెను.

## ప్రస్తావన

(ప్రియాంబుల్)

అనేక లిఖిత పూర్వకమైన సంవిధానముల వలెనే, అనేక చట్టముల వలెనే, ఇండియా సంవిధానము కూడ ప్రస్తావనతో ప్రారంభమగుచున్నది. సంవిధానమునకు, లేక శాసనమునకు, ప్రస్తావన ఒక ఉపోద్ఘాతము వంటిది. కాని, పుస్తకమునకు గల తొలిపలుకు కంటె అది ఎక్కువైనదే. పుస్తకము ముందలి పీఠిక ఆ పుస్తకము యొక్క పోకడను గూర్చి సూచించును; అంతే; కాని సంవిధానము యొక్క గాని లేక శాసనము యొక్క గాని ప్రస్తావన సంవిధానమును చేసిన వారి యొక్క (అనగా ఇండియా సంవిధాన సందర్భములో సంవిధాన సభ అన్నమాట) కోర్కెలు, ఉద్దేశము లెట్టివో, వాదు

సంవిధానములో చేర్చుకొనదలచిన సూత్రములు, భావములు ఎట్టివో, సంవిధానముయొక్క లక్ష్యము, ప్రయోజనము లెట్టివో మనకు తెలియచెప్పను. స్టోరీ చెప్పియున్నట్లు, ఒక శాసనముయొక్క ప్రస్తావన, ఏ యే దోషములను నివారించుటకు, ఏ యే లక్ష్యములను అంగీకరించుటకు ఆ శాసనపు ఉపబంధనలను (ప్రొవిజన్స) శాసనకర్తలు ఏర్పాటుకావించిరో వాటిని ప్రకటించుచు, ఆ శాసనకర్తల మనోభావమును వెలిబుచ్చు మంత్రము.

నాగరికులలో రాజ్యధర్మశాస్త్రము వెలువడిన అతి ప్రాచీనకాలమునుండియు ప్రస్తావనయొక్క ప్రాముఖ్యము గుర్తింపబడియే యున్నది. ప్రాచీన రోమనుల విధి (లా)కి సంబంధించిన సిద్ధాంతము ఒకటి ఇట్లున్నది : ''ఒక చట్టపు ప్రస్తావనకు ఫలితము లేకపోయినచో, ఆ చట్టముకూడ నిష్ఫలమగును'' — అని. ఏదైన నొక చట్టమును లేక సంవిధానము గూర్చి మనము విచారించినపుడు వాటియొక్క ప్రస్తావనను మనస్సునందు ఉంచుకొనవలెను. అప్పుడే మనము దానియొక్క నిజమైన తత్వమును — అనగా పూర్తియగు సంవిధానముయొక్కగాని, దానియందలి ఏ భాగము అనుచ్ఛేదము (ఆర్టికల్) లేక విభాగము యొక్కగాని, నిజమైన తత్వమును తెలిసికొనగలము.

ప్రస్తావనను తెలిసికొని దాని యర్థమును గ్రహించిన గాని, సంవిధానమును తెలిసికొనలేము; అర్థము చేసికొనలేము.

ఇండియా సంవిధానముయొక్క ప్రస్తావన ఈ విధముగా నున్నది:

"ఇండియా ప్రజలమగు మేము, ఇండియాను సంపూర్ణ ప్రభుత్వ ప్రజాస్వామ్యగణ రాజ్యము (రిపబ్లిక్) గా నెలకొల్పుటకు మరియు అందలి పౌరులెల్లరకు సామాజిక, ఆర్థిక, రాజకీయ విషయములలో న్యాయమును;

భావ, భావప్రకటన, విశ్వాస, ధర్మ, ఆరాధన విషయములలో స్వాతంత్ర్యమును;

సమాన అవకాశ, ప్రతిపత్తులను (స్టేటస్) చేకూర్చుటకును;

మరియు వారందరి యందును

వ్యక్తిగౌరవమును, రాష్ట్రముయొక్క ఐక్యతను పురికొల్పునట్టి సౌభ్రాతృత్వమును పెంపొందించుటకును;

భక్తిపురస్సరముగ తీర్మానించుకొని,

ఈ 1949-వ సంవత్సరము నవంబరు నెల ఇరువది యారవ తేదీని మా సంవిధాన సభయందు

ఇందుమూలముగా ఈ సంవిధానమును అంగీకరించి, అధినియమము (ఇనాక్టు) చేసి స్వీకరించిన వార మైతిమి."

ఈ ప్రస్తావన సంవిధానముయొక్క సూత్రములను, లక్ష్యములను స్థాపించుచున్నది. వాటిని సంవిధానమందలి ఖండములు (క్లాజెస్), విభాగములును నిరూపించవలసియున్నది. మొట్టమొదట : ఇండియా గణరాజ్యము కావలసియున్నది ; అనగా, రాజ్యము యొక్క అధిపతి వంశపారంపర్యముగా వచ్చిన రాజు కాకూడదు ; ప్రజలచేతగాని, ప్రజాప్రతినిధులచేత గాని ఎన్నుకొనబడిన వ్యక్తియై యుండవలెను. రెండవది ; అది సంపూర్ణప్రభుత్వమై (సావరిన్) యుండవలెను : అనగా, ఇతరరాజ్యములన్నింటిపట్ల స్వాతంత్రము కలదై యుండవలెను. ఉదాహరణ : విస్తారమైన రాజ్యముల సమాఖ్యలోగాని, లేక ఐక్యరాజ్యసమితి వంటి ప్రపంచసంస్థలలోగాని సభ్యత్వమూలమున దాని సంపూర్ణ ప్రభుత్వాధికారమును సంకుచితపరుచుకొనిన యెడల, అట్టిది స్వబుద్ధికి తోచి, ఇష్టప్రకారము కావించునదై యుండవలెను. మూడవది : ప్రభుత్వము ప్రజాస్వామ్యమై యుండవలెను. అనగా, జగద్విదితమైన అబ్రహామ్ లింకన్ యొక్క సిద్ధాంతములో చెప్పినట్లు, ప్రజలకొరకు, ప్రజలచేత, ప్రజలను పాలించుట

అన్న మాట. దానియొక్క సర్కారు, దానిమంత్రులు, దాని విధానసభలు ప్రజలచేత ప్రత్యక్షముగానో, పరోక్షముగానో ఎన్నుకొనబడవలయును. పైగా, ప్రత్యక్షముగానో, లేక తాము ఎన్నుకొనిన ప్రతినిధుల ద్వారానో, అవన్నియు ప్రజలకు బాధ్యతగలవై యుండవలెను. దేశప్రభుత్వపు స్థూలప్రకృతియు, స్వభావమును ఇట్టివి.

ప్రస్తావన తెలియజేయు విషయము ఇంకను కలదు. సంవిధానమునందలి వివిధ అనుచ్ఛేదములలోను, విభాగములలోను పాటించవలసిన సర్వసాధారణమైన సూత్రములను, ఆదర్శములను అది నిరూపించుచున్నది. లక్ష్యముల యొక్క జాబితాలో న్యాయమునకు అగ్రస్థాన మివ్వబడినది. ఏ ప్రభుత్వమునకైనను ఇంతకంటె ఉత్కృష్టమైన ఆదర్శ ముండజాలదు. న్యాయమే లేనిచో, రాజ్యములు కేవలము దోపిడీలేనని యూరపులోని రాజ్యాంగ తత్త్వజ్ఞాన స్థాపకులలో నొకరియొక్క అభిప్రాయము. ఎచట నిజమగు న్యాయము లభించదో అచట ఒప్పు అనునది ఏదియు నుండజాలదని సెంట్ ఆగస్టైను కూడ వాదించి యున్నాడు. సర్కారుయెడల ప్రజలు భక్తికల్గి యుండునట్లును, ఒకరియెడ నొకరు విశ్వాసము కల్గి యుండునట్లును, రాజ్యము అవిచ్ఛిన్నముగా నుండు

నట్లును చేయునదేది? ప్రభుత్వములు ప్రజలయెడ, ప్రజలు ఒండొరులయెడ చూపెట్టునట్టి న్యాయమే అది. అనగా, ప్రతివ్యక్తికి చెందవలసినదానిని అందచేయుటయే. ఇండియాలో శతాబ్దములుగా కొన్నితరగతుల వారందరికి న్యాయముజరుగనేలేదు. అట్టిచో, స్వేచ్ఛా, స్వాతంత్ర్యము గల నవభారతములో ప్రభుత్వము యొక్క ఆదర్శములలో ప్రధానముగా న్యాయమును పేర్కొనుట ఎంతయో ఉత్సాహజనకముగా నున్నది.

పిమ్మట ప్రజల, ప్రభుత్వములముందు సంవిధానము ఉంచిన లక్ష్యములలో భావ, భావప్రకటన, విశ్వాస, ధర్మ, ఆరాధనవిషయములలో స్వాతంత్ర్యము పేర్కొనబడినది. మనస్వాతంత్ర్యము, ముద్రణా స్వాతంత్ర్యము, మత స్వాతంత్ర్యము మొదలగు ఘనమగు స్వాతంత్ర్యము లన్నింటిని స్థిరపరచియున్నారు. అనగా, ఇండియా స్వేచ్ఛగా ఆలోచించుటకు, పలుకుటకు, ప్రవర్తించుటకు స్వేచ్ఛ గల పురుషులు, స్వేచ్ఛగల స్త్రీలు నివసించు భూమి అన్నమాట. అయితే ఈ కార్యములన్నియు క్రమపద్ధతికి (ఆర్డరు) కావలసినట్లు మితిగా నుండవలెను. అదియే లేనియెడల స్వాతంత్ర్యము ప్రవర్తిల్లదు.

తరువాత, అవకాశములలో, ప్రపత్తులలో సమత ప్రజలెల్లరకును ఖండితముగా చెందగలదు.

మొదట, 1-వ భాగము 1-4 విభాగములలో ఈ సంవిధానము భూమండలములో ఇండియా రాజ్య క్షేత్రమును నిర్వచించుచున్నది. ఇండియానుండి విడ తీయబడిన పాకిస్థానమునొక్క, భూటానునొక్క, పరరక్షణలోనున్న సిక్కిమునొక్క రాజ్యములు అందునుండి మినహాయింపబడినవి. 2-వ భాగము 5-11 విభాగములలో ఇండియా పౌరుడుగా నెవ్వడు లెక్కింపబడవలయునో మాఘిగా జెప్పుచున్నది. ఇండియా రాజ్యక్షేత్రమున అధివాసము (డొమిసైలు) ఏర్పరచుకొనియున్న ఇండియా రాజ్యక్షేత్రములో జన్మించిన, లేక అతని తల్లి తండ్రులలో నెవరైన ఇండియా రాజ్యక్షేత్రములో జన్మించియుండిన, లేక ఈ సంవిధాన ప్రారంభమునకు అనగా జనవరి 26, 1950 సం. నకు పూర్వము అవ్యవహితముగ ఐదు సంవత్సరములకు తక్కువగాకుండ ఇండియా రాజ్య క్షేత్రములో సాధారణముగ నివసించుచుండిన ప్రతి వ్యక్తియు ఇండియా పౌరుడగును. తరువాత సంవి ధానము పౌరునియొక్క అధికారముల గురించి ప్రస్తా వించుచున్నది. వాటిని మూలాధికారము లనుటలో అర్థగాంభీర్య మెంతైన కలదు. ఈ భాగము సంవి ధానమందలి ముఖ్యాతిముఖ్యమైన ప్రకరణములలో నొకటి.

తన హక్కులగూర్చి ప్రసంగించునట్టి ఈ ప్రకరణమునందు ఇండియాపౌరుడు అత్యంతము శ్రద్ధ వహింపవలసియున్నది. ఎందుకనగా, ఆ యధికారములు స్వతంత్రమైన దేశములో స్వతంత్రుడగు పౌరుడుగా నుండుట కాతనికి అవకాశ మిచ్చుచున్నవి. సంవిధానము అతనికి ఈ యధికారములను మొట్టమొదటి సారిగా ప్రసాదించియుండలేదు. ఇవి స్వతంత్ర ప్రజలకు జన్మతహా సంక్రమించునట్టి అధికారములు. సామాన్య విధి (కామన్ లా) పద్ధతిలో బ్రిటిషు పరిపాలనా కాలమున అవి అమలునందుండి అనుభవింపబడుచుండెడివి. ప్రెసిడెన్సీ పట్టణములనబడు మదరాసు, కలకత్తా, బొంబాయిలలో ఈ హక్కులు విధి (లా) వలె పరిగణింపబడుచుండెడివి. మిగిలిన బ్రిటిషు ఇండియాలో వాటిని అభిసమయములుగా* (కన్వెన్షన్సు) పాటించుచుండిరి. ఆంగ్లేయులకు చట్టమెంతో నిర్బంధమో, అభిసమయమును అంతే. ఆంగ్ల భాష మాట్లాడునట్టి దేశములలో ఈ యధికారములను సామాన్యవిధి హక్కులనియు మిగిలిన ప్రపంచములో స్వతంత్రులగువారి జన్మతో సంక్రమించు హక్కులనియు గణించి, పాటించుచుండిరి.

సంవిధానమందలి యీ ప్రకరణములో ని

*సదాచారములుగా

హక్కులు రూపొందినవి. కాని, సంవిధానము వాటిని మొదటగా ప్రసాదించియుండలేదు. ఉన్నవాటినే స్థిరపరచియున్నది. సంవిధానపు ప్రాంగణమునందే వాటిని పేర్కొని వాటియొక్క విశేషమగు ప్రాముఖ్యమును చాటియున్నారు. స్వతంత్ర పౌరునియొక్క ఈ మూలాధికారములను అమలుజరుపుటకే సంవిధానమంతయు వ్రాయబడినట్లు కనబడుచున్నవి. అవి యెట్లున్నను, ఇండియా పౌరుని స్వతంత్ర దేశములో స్వతంత్ర పౌరునిగా చేయునట్టివి ఈ యధికారములే.

ఈ స్వాతంత్ర్యమును అనుభవించుటలోను, చెలాయించుటలోను ఇతర వ్యక్తులయొక్క, లేక జననికాయముల (జాడీ) యొక్క, లేక సర్కారుయొక్క బలము, శక్తివలన సంభవించు విపత్తునుండి పౌరుని రక్షించవలసియున్నది. రాజ్యముయొక్క ప్రతినిధిగా సర్కారు తన సైన్యము, పోలీసుశాఖలద్వారా అతి విస్తారమగు శక్తి భారమును ప్రయోగించుచున్నది; గనుక, పౌరునియొక్క అధికారములను ప్రత్యేకముగా రాజ్యము వారినుండి రక్షింపవలసియున్నది. సంవిధానపు విధిలోను, రాజకీయ శాస్త్రములోను గల శీర్షికలలో రాజ్యమునకును వ్యక్తికిని గల సంబంధ బాంధవ్యములు, ప్రాధికారమును స్వేచ్ఛను సమన్వయపరచుట, అనునవి ముఖ్యాతిముఖ్యములు.

ఈ ప్రకారము రాజ్యాంగము క్రింది పౌరుని రక్షించుట ఇండియా పౌరుని మూలాధికారములలో ప్రధానముగా లెక్కకు వచ్చుచున్నది. ఈ 'రాజ్య' మనుపదములో ఇండియా సర్కారును, సభను (పార్లమెంటు) ఉన్నూ రాజ్యముల యొక్క విధానసభలు, సర్కారులున్నూ, మరియు ఇండియా రాజ్యక్షేత్రమందున్నట్టియంతటివిన్నీ ఇండియా సర్కారుకు లోబడినటువంటివిన్నీ, స్థానికమైన, ఇతర సార్వజనిక ప్రాధికారులును, ఉద్యోగులును—అందరు ఇమిడియున్నారు. రాజ్యము ఏ పౌరుని విషయమునను కేవలము మత, జాతి, కుల, స్త్రీపురుష భేద జన్మస్థానముల కారణమున లేక వాటిలో దేని కారణమునగాని విభేదమును చూపకూడదని సంవిధానమందలి 15–వ విభాగము ఏర్పాటుచేయుచున్నది. పైగా, ఏపౌరుడును కేవలము మత, జాతి, కుల స్త్రీపురుష భేద జన్మస్థాన కారణముల గాని లేక, వాటిలో దేని కారణమునగాని అంగళ్లలో, సార్వజనిక ఉపహారశాలల్లో, భోజనశాలల్లో, సార్వజనిక వినోద స్థలములలో ప్రవేశించు విషయమునను; పూర్తిగా గాని, కొంతవరకు గాని రాజ్యధనమువల్ల పోషింపబడునట్టి, లేక సార్వజనిక ఉపయోగార్థము ఉద్దేశింపబడినట్టి బావులు, చెరువులు స్నాన ఘట్టములు, సార్వజనిక సమావేశ స్థలములను

ఉపయోగించుకొను విషయమునను, ఎటువంటి నిర్యోగ్యతను (డిసెబిలిటీ) గాని, బాయిత్వమునకుగాని (లయబిలిటీ), నిర్బంధమునకుగాని. షరతునకుగాని లోనగునట్లు చేయకూడదని కూడ ఖండితము చేసియున్నది. కులతత్వమును, ఇతర సాంఘిక దురభిమానములను ఆచరణలో నుంచుటచేత కొన్ని పౌరసమూహములు నష్ట, కష్టములకు పాలగుటకు కారణమైన సాంఘిక నిర్యోగ్యతలు. అన్యాయములను గూర్చి ఈ విభాగ ముదహరించుచున్నది. కనుక, ఈ విభాగము నవభారతముయొక్క జ్ఞానభాసితమగు సాంఘిక మనస్సాక్షి యొక్క విజయమును ధృవపరచుచున్నది.

తరువాతి విభాగము (అనగా 16-వది) పౌరులందరకును, వారి వారి కుల, స్త్రీపురుష భేదములతో నిమిత్తము లేకుండగా, దేశమందలి లోక సేవలలో (పబ్లికు సర్వీసెస్) పదవీనియుక్తి (ఎంప్లాయిమెంటు) విషయములో సమతను స్థిరపరచుచున్నది. 19-వ విభాగము ఎట్టి వృత్తినైనను ఆచరించుటకును, ఏ ఉపజీవికనైనను (అక్యుపేషను) వ్యాపారమునైనను, వర్తకమునైనను జరిగించుటకు పౌరునికిగల హక్కును కూడ స్థిరపరచుచున్నది. 19-వ విభాగము కార్యస్వాతంత్ర్యమును ధృవపరచుచున్నది. పౌరులందరకు వాక్కు మరియు భావప్రకటనల స్వాతంత్ర్యమునకు,

శాంతియుతముగాను, ఆయుధములు లేకుండగాను సమావేశమగుటకు స్వాతంత్ర్యమునకును ; సమాజము లను సంఘములను ఏర్పాటు చేయుటను, ఇండియా రాజ్యక్షేత్ర మందంతటను సంచారము చేయుటకును ఇండియా రాజ్యక్షేత్రమునందే భాగమందైనను నివసించుటకు, నివాసమేర్పరచుకొనుటకును అధికారము కల దని తెలియజేయుచున్నది. అనుమూలమున, ఈ విభాగము పౌరులందరు వారికి ఇచ్చవచ్చిన రీతిని వ్యక్తులగూర్చి వ్యవహారములనుగూర్చి మాట్లాడుటకును, సాంఘిక జీవితములో వారేది సాధింప సంకల్పింతురో దానిని చేయుటకును కల్గియున్న యధికారమును పునరుద్ఘాటించుచున్నది. అయితే, ఈ హక్కును రాజ్యభద్రత (ఆర్డరు) కు భంగము వాటిల్లనంతవరకు మాత్రమే చెలాయించవచ్చును. ఎందుకనగా, రాజ్యభద్రత లభించుచున్నంత వరకే స్వేచ్ఛసంభవము యథార్థము కాగలదు. అట్లు గాక పోయినచో, బలవంతులకు మాత్రమే స్వేచ్ఛ ప్రాప్తించును. ఈ యధికారమును చెలాయించుటలో, మానవష్టకరమైనను, దుర్భాషలకును, రాజ్యద్రోహాచర్యలకును చెందిన విధికి (లా) లోబడియుండవలెను. వాక్కు లేక భావప్రకటనా స్వాతంత్ర్యము రాజ్యభద్రతను భంగపరుపని రీతిగా ఈవిధి (లా) శాసించును.

19-వ (1-4) విభాగము ఆర్థిక వ్యాపారమందు స్వాతంత్ర్యమును స్థిరపరచుచున్నది. ఆస్తిని ఆర్జించుటకు, ఉంచుకొనుటకు, అన్యాక్రాంతము చేయుటకు అధికారము నిచ్చుచున్నది. 31-వ విభాగములో, విధి (లా) యొక్క అధికారముననే తప్ప ఏ వ్యక్తి యొక్క ఆస్తిని బలవంతముగా తీసికొనరాదని అభయము మీయబడినది. అయితే, ఆ స్థియందు నియమ రహితముగ అధికారము కలదని యంగీకరింపబడలేదు. వ్యక్తులయొక్క ఆస్తిని సార్వజనిక ప్రయోజనము నిమిత్తము రాజ్యము స్వాధీనముచేసికొనుటకు ఏర్పాటు చేయబడినది. కాని, వ్యక్తికి నష్టపరిహారమునకు గల అధికారము నిశ్చయింపబడినది.

23-వ విభాగములో మానవులను అమ్ముట, (ట్రాఫిక్) దేశమందలి కొన్ని ప్రాంతములలో సంభవించుచున్న 'బేగారు' అను బలవంతపు వెట్టిచాకిరీ, దానికి తుల్యమైన నిర్బంధ సేవాపద్ధతులు, నిషేధింపబడినవి. ఈ విభాగమును ఉల్లంఘించిన ఏ అపరాధియైనను విధరీత్యా దండింపబడును. 24-వ విభాగము ప్రకారము 14 సంవత్సరములకంటె తక్కువ వయస్సుగల ఏబిడ్డయైనను ఏ కార్ఖానాలోగాని, గనిలోగాని అపాయకరమైన ఏ యితర పనిలోగాని నియమింపబడకూడదు.

అస్పృశ్యత పురాతనకాలమునుండి వచ్చుచున్న రాక్షసమగు సాంఘిక దురాచారము; 17-వ విభాగము దానిని రద్దుచేయుచున్నది. ఏ రూపమున నైననుసరే, దానిఆచరణ నిషేధింపబడినది. దేశములోని విధానసభలు అందునిమిత్తమై కావించిన విధుల ప్రకారము అస్పృశ్యత నుండి ఉత్పన్నమగు ఏ నిర్యోగ్యతనైనను అమలుపరచుట దండనీయమగు అపరాధమగును. ఇటీవల కేంద్రవిధానసభ కావించిన విధులప్రకారము అస్పృశ్యత ఏ రూపమునగాని, ఎంతవరకుగాని అమలుపరచుట జరిమానాతో లేక కారాగారవాసముతో శిక్షింపవలసిన అపరాధముగా చాటింపబడినది.

అస్పృశ్యులే గాక సాపేక్షాయికముగా అధికారములు పొందిన కొన్నితరగతుల ప్రజలున్నారు. వారినికూడ సంవిధానము కాపాడుచున్నది. ఎందుకనగా, ఇండియాదేశము కేవలము వ్యక్తులేగాక సమాజములుకూడ (కమ్యూనిటీలు) గల దేశమని సంవిధానము గుర్తించినది. ఇండియాలో ఒకేభాషను మాట్లాడునట్టి ఒకేప్రజగాక, అనుసూచిత (షెడ్యూల్డు) కులములు, జాతులవలెనే వివిధమైన భాషలు మాట్లాడుచు వివిధమతముల నవలంబించుచు, వివిధ కులములకు సాంఘిక తరగతులకు చెందిన సమాజము

యున్నవి. ఇటువంటి సమూహములయొక్క హక్కులను కూర్చిన విభాగము లెన్నియో ఈ కారణముచేతనే మన సంవిధానములోనున్నవి.

26-వ విభాగము ప్రకారము ప్రతి యొక మత శాఖగాను, దానిలో ఉపశాఖలును, మత, ధర్మ కార్యముల నిమిత్తము సంస్థలను స్థాపించుటకు, పోషించుటకు, మతవిషయములలో తన వ్యవహారములను తానే నిర్వహించుకొనుటకును, చరస్థిరాస్తులను సంపాదించి, పొందియుండుటకును, చట్టముద్వారా అట్టి ఆస్తిని చక్కబెట్టుకొనుటకును అధికారము కలిగియుండవలెను. 30-వ విభాగము ప్రకారము మతమూలమునగాని, భాషామూలమునగాని ఏర్పడిన అల్పసంఖ్యాకు లందరును తమకు అభీష్టమైన విద్యాసంస్థలను స్థాపించుటకు, వాటిని నిర్వహించుటకు అధికారము కలిగియుండవలెను. ఈ విభాగపు 2-వ ఉపవిభాగములో రాజ్యము, విద్యాసంస్థలకు సహాయముచేయుటలో మతము మూలమునగాని, భాషామూలమునగాని ఏర్పడిన అల్పసంఖ్యాకుల నిర్వహణలోనున్నదను కారణముచేత ఏ విద్యాసంస్థ పట్లను విభేదభావము చూపకూడదు.

[illegible] అధికారము పౌర [illegible] అయినను, వ్యక్తిగత స్వాతంత్ర్యమునగాని, సామాన్యమైన విధి (లా) ద్వారా

గాని ఏర్పడిన పరమత అసహనము వలన కష్టముల పాలగువారు అల్పసంఖ్యాకులే. అందుచేతనే, మత స్వాతంత్ర్యమునుగూర్చిన ఈ విభాగము తమ మత స్వేచ్ఛను రక్షించు ఉపకరణమని అల్పసంఖ్యాకులు దానికి జోహారు చేసియున్నారు. ఈప్రకారము 25-వ భాగము సార్వజనిక వ్యవస్థకును (పబ్లిక ఆర్డరు) సదాచారమునకును, ఆరోగ్యమునకును ఈ విభాగ మందలి ఇతర ఏర్పాట్లకును అధీనమై, జనులెల్లరు అంతఃకరణ స్వాతంత్ర్యమునకును మతమును స్వేచ్ఛగా అవలంబించి, ఆచరించి, ప్రచారముచేయు అధికార మునకును హక్కు కలిగియుండవలెను. ఈ హక్కు పౌరులకు మాత్రమేగాక జనులెల్లరకు యివ్వబడి యుండుట గమనింపవలెను. ఇట్లు, ఈ విభాగము మూలముగా, ఇండియా, పౌరులకు, దేశాంతరులకు గూడ అందరకు మతస్వేచ్ఛ నొసంగిన దేశమని ప్రపంచ దృష్టిలో ఘనత వహించినది.

సంవిధానము కొన్ని అధికారములను ప్రసాదించి యుండవచ్చును. వాటికి హామీయిచ్చి యుండవచ్చును. కాని, ప్రజలనుండి వారి యధికారములను అపహరింప యత్నించు వ్యక్తికీ, వ్యక్తుల సముదాయమునకూ, లేక సర్కారులకూ, విరుద్ధముగనైనను సరే ఈ అధికారములను అమలుజరిపినగాని, వాటివల్ల ప్రజల

కెట్టి యుపయోగము లేక, ఈ అధికారములు సంవిధానపు పుటలపై అట్లే నిలిచియుండును. కనుకనే 32-వ విభాగములో సంవిధానము వాటిని అమలు జరుపుట కేర్పాటు చేసియున్నది. సంవిధానములో స్థిరపరచిన అధికారములను ప్రవర్తింపచేయుటకు సంవిధానరీత్యా విధి (లా) రీత్యా పరిహారములను కూర్చి హామీ ఇచ్చియున్నది. ఈ విభాగము ఇట్టి హక్కులను ప్రవర్తింపజేయుటకై, నష్టపడిన వ్యక్తులకు ఉచ్చతమ న్యాయాలయములో (సుప్రీము కోర్టులో) కేసు వేయుటకు అధికారమిచ్చియున్నది. ఈ అధికారములను ప్రవర్తింపజేయు నిమిత్తము, సందర్భము ననుసరించి నిదేశములను (డైరెక్షన్సు) ఆదేశములను, లేక లేఖలను (రిట్సు) ప్రసరింపచేయుటకు ఉచ్చతమ న్యాయాలయమునకు శక్తినిచ్చియున్నారు. కేంద్ర విధానసభ అటుతరువాత పారితము (పాసు) చేసిన విధులచే ఉచ్చన్యాయాలయము (హైకోర్టు) లకును ఈ శక్తినిచ్చిరి. బందీప్రత్యక్ష (హేబియస్ కార్పస్), పరమాదేశ (మాండమస్), ప్రతిషేధ (ప్రొహిబిషన్), అధికారపృచ్ఛ (కోవారంటో), మరియు ఉత్ప్రేషణ (సెర్షియోరారి) అనబడు ఈ లేఖలు ఆంగ్లచరిత్రలో ప్రసిద్ధములైనవి. బందీప్రత్యక్షలేఖ అనగా అసలు లాటినుభాషలో "వ్యక్తిని రప్పించుకొనవచ్చును" —

అని అర్థము. ఒక వ్యక్తిని విధి (లా) విరుద్ధముగా బందీగా చేసియుంచినపుడు, అనగా ఒక న్యాయాలయముయొక్క, సర్కారుయొక్క, లేక ప్రభుత్వోద్యోగులయొక్క నేరారోపణగాని, లేక తీర్పు, శిక్ష గాని లేకుండ బందీగా నుంచినయెడల, ఈ లేఖను ప్రయోగించవచ్చును. అట్టి వ్యక్తులపై మోపిన కేసును త్వరగా విచారణకు తెచ్చుటయే దీని ఉద్దేశ్యము. న్యాయాధీశునివలె, లేక కొంతవరకు న్యాయమూర్తివలె ప్రవర్తించుచున్న ప్రభుత్వ నికాయములు తమ క్షేత్రాధికారమును (జ్యూరిస్‌డిక్షన్) మీరిగాని, చట్టమును అతిక్రమించిగాని ముందుకు సాగిపోకుండ ఆటంకపరచునట్టి ఆదేశమునకు ప్రతిషేధమని పేరు. పరమాదేశమను లేఖ అట్టి నికాయమునకు నిశ్చయముగా నిచ్చిన ఆదేశము. అధికారపృచ్ఛ అను లేఖ సర్కారును, లేక ప్రభుత్వోద్యోగులనుగాని ఒక వ్యక్తిని శిక్షింపబూనుకొనుటకు గల విధి (లా) సంబంధమైన కారణమును చూపింపుమని ఆజ్ఞాపించును. న్యాయాధీశునివలె, లేక కొంతవరకు న్యాయాధీశునివలె ప్రవర్తించుచున్న ప్రభుత్వ నికాయముయొక్క వ్యవహారముల రికార్డును న్యాయస్థానమునకు పంపవలసినదిగా కోరును. తత్ఫలితముగా, ఏదైన అక్రమమును తొలగించుటకు ఆదేశ మీయవచ్చును.

ఈ లేఖలలో ఏదైనా నొకదానిని ఉపయోగించుకొని, సర్కారుచేతగాని, సార్వజనిక నికాయము (Public Body) చేతగాని, వ్యక్తులచేతగాని తనకున్న అధికారములలో నొకదానికి భంగము వాటిల్లినదని తలంచిన పౌరుడు తనకు కల్గిన అన్యాయములకు పరిహారముకొరకై దావా వేయవచ్చును. ఉదాహరణ: ఒక పోలీసు ఉద్యోగస్థుడు ఒక పౌరుని అరెస్టుచేసి, అతనిని న్యాయస్థానము సమక్షమున విచారణకు తీసికొని రాకుండగా సబబుఅయిన వ్యవధికంటె యెక్కువ కాలము బందీగా నుంచినయెడల, ఆ పౌరుడుగాని, లేక అతని తరఫున మరి యెవరైనగాని ఉచ్చతమ న్యాయాలయమునకు లేక ఈవిషయములో ప్రాధికారమివ్వబడిన ఏ అధీన న్యాయస్థానమునకైనను బందీ ప్రత్యక్ష లేఖ కొరకు అర్జీ పెట్టుకొనవచ్చును. పౌరుడు విధికి వ్యతిరేకముగా పోలీసు బందీలో నిర్బంధింపబడియున్నాడని న్యాయాలయము నిర్ణయించిన యెడల, న్యాయస్థాన మతనిని విముక్తుని చేయుటకు ఉత్తరవిచ్చును, లేదా న్యాయస్థాన సమక్షమున విచారణ చేయుటకు అతనిని తీసికొనిరమ్మని ఆదేశించును. పోలీసు ఉద్యోగి ఆ ఆదేశమును నిర్వహించును.

ప్రవర్తింపచేయుటకు అనువుకాని అధికారముల వలన పౌరున కెట్టి ప్రయోజనము లేదు. అధికారము

లకు భంగము కలిగినయెడల వాటికి పరిహారము లుండ వలయును. విధి (లా) విషయమున ప్రపంచములో కెల్ల ఎక్కువ కృషిచేసినప్రజలలో నొకరగు ప్రాచీన రోమనులు ఈ సత్యమును గ్రహించిరి. "పరిహారము లేకుండగా అధికార ముండనేరదు" అని వారియొక్క సూక్తి. పౌరునియొక్క అధికారములను ప్రవర్తింప చేయుటకు వలసినంత ఏర్పాటుచేయబడి యుండుట మన సంవిధానమందు మహోజ్జ్వలమగు సద్గుణము.

## ప్రభుత్వ సంస్థలు - విధానమండలి

(రెజిస్లేచరు)

పౌరులయొక్క అధికారములను కాపాడుటకు న్యాయస్థానములో లేఖద్వారా పరిహారమేగాక యితర సాధనములు కూడ కలవు. వీటిలో ముఖ్యమైనవి దేశమండలి ప్రజాప్రాతినిధ్యముగల విధాన మండలులు. పౌరునికి ప్రతినిధిగానుండు సమావేశములివి. పౌరుల యొక్క అధికారములను, శ్రేయస్సులను రక్షించుట వీటి ప్రధాన ధర్మములలో నొకటి. ఎందుకనగా, రాజకీయముగా ఇండియాను కొన్ని రాజ్యములుగా భాగించియున్నారు. ఈ రాజ్యములలోని విధాన మండలులు దూరముగా ఢిల్లీలోనున్న కేంద్రవిధాన మండలి కంటె పౌరునికి ఎక్కువ సన్నిహితముగా

నుండును. కనుక మొదట మనము రాజ్యవిధాన మండలిని గూర్చి విచారింతము.

## రాజ్య విధాన మండలి

(ఏక సదన లేక ద్విసదన విధాన మండలి)

169-వ విభాగము ప్రకారము ప్రతియొక రాజ్యమునకును ఒక విధానమండలి యుండవలెనని సంవిధానము నిదేశించుచున్నది (డైరెక్షన్). అది, ఒక రాజ్యపాలునితోను (గవర్నరు), బీహారు, బొంబాయి, మదరాసు, పంజాబు, సంయుక్తరాష్ట్ర ములు, పశ్చిమబెంగాలు రాజ్యములలో ద్విసదనపు (బైకామిరల్) విధానమండలితోను, మిగిలిన రాజ్యము లలో ఏకసదనముతోను కూడియుండవలెను. రెండు సదనములున్నచోట ఒకదానికి విధానసభ అనియు, రెండవదానిని విధానపరిషత్తు అనియు, ఒకే సదన మున్నచోట దానిని విధానసభ అనియు పిలువవలెనని సంవిధానము నిదేశించుచున్నది.

మంచి విధులను (లా) తయారుచేయుట, సమర్థ ముగా ప్రజలకు ప్రాతినిధ్యము వహించుట అనునవి విధానమండలియొక్క కర్తవ్యములు. కనుక ఈ లక్ష్యసిద్ధికి తోడ్పడునట్లుగా విధానమండలిని సంఘటన

(అగ్రాని జేషను) చేయవలసియున్నది. వలసినంతగాను యుక్తముగాను సమాలోచన చేయని చే విధులను పారితము చేయరాదు. అందుచేతనే, చారిత్ర్యక మైన అనుభవము విధానమండలిలో రెండు సదనము లుండవలెను. ఇది [illegible] ఇండియాలోని ప్రధాన రాజ్యములగు మదరాసు, బొంబాయి, పశ్చిమబెంగాలు, ఉత్తరప్రదేశ్, పంజాబులలో విధానమండలి విధానసభ అనియు విధానపరిషత్తు అనియు రెండు సదనము లున్నవి.

## విధానసభయొక్క విరచన

## (కాంపోజిషన్)

ప్రతిరాజ్యముయొక్క విధానసభ ఓటు వేయు టకు అర్హతగల పౌరులచేత ప్రత్యక్షమైన ఎన్నిక ద్వారా ఎన్నుకోబడిన సదస్యులతో (మెంబర్లతో) కూడినదై యుండవలెను. స్త్రీపురుష భేదముతో నిమిత్తము లేకుండ 21 సంవత్సరములు వయస్సుకల్గిన పౌరులందరును ఓటు వేయుటకు అర్హత కల్గినవారు; పైగా, సంవిధానము క్రిందగాని, లేక సముచిత విధాన మండలిచే చేయబడిన ఏ విధిచేతనైననుగాని, నివాసము, చిత్తవికృతి, అపరాధము లేక భ్రష్టాచరణము, లేక విధి విరుద్ధ ఆచరణమను కారణమున అనర్హ

లుగ నిర్ణయింపబడని వారందరు ఓటు వేయవచ్చును. ఈవిధముగా రాజ్యమునందలి ఎన్నికల జాబితాలో నమోదు (రిజిష్టరు) చేయబడిన పౌరులందరు ఓటు వేయుటకు హక్కు కలిగియున్నారు.

హిందూమతస్థులైనను, ముసల్మానులైనను, క్రిస్టియను లైనను సరే — ఓటర్లు అందరు ప్రాదేశికమైన ఎన్నిక క్షేత్రములలో (టెరిటోరియల్ కాన్‌స్టిట్యుయెన్సీ) సమష్టి నియోజక వర్గములలో (జాయింటు ఎలక్టొరేట్సు) జాబితా [illegible] [illegible] చేయబడుదురు. [illegible] కులముల యొక్క లేక షెడ్యూలు జాతులయొక్క జనాభాను బట్టి రాజ్యములలోని మొత్తము జనాభాలో వారి (ప్రాపోర్షను) [illegible] ఉండునో [illegible] స్థానము లను ఆ దేశ నిష్పత్తిలోనుండు స్థానములు అనుసారించి కులములకు, జాతులకు కేటాయింపు చేయబడియున్నవి. ఈ కేటాయింపునకు అర్థమేమనగా — ఆ స్థానములకు ఎన్నుకొనబడుటకై ఆ కులముల ఆ జాతుల సభ్యులే నిలుచుండవలెను. రాజ్యముయొక్క విధానసభలో ఆంగ్లో-ఇండియను సముదాయము (కమ్యూనిటీ) నకు ప్రాతినిధ్యము కావలసియున్నదని రాజ్యపాలకుడు అభిప్రాయపడియున్న యెడల, ఏ రాజ్యములోనైనను నామ నిర్దేశము (నామినేషను) ద్వారా ఆంగ్లో-ఇండియను లకు ప్రాతినిధ్య మీయవచ్చును.

## విధాన పరిషత్తు విరచన

విధానపరిషత్తు కల్గిన రాజ్యములో, ఆ పరిష త్తులో నుండు మొత్తము సదస్యుల సంఖ్య అచటి విధాన సభలోనుండెడి మొత్తము సదస్యుల సంఖ్యలో నాల్గవవంతు అతిక్రమించి యుండరాదు; అయితే, విధానపరిషత్తులోని సదస్యుల మొత్తపు సంఖ్య 40 మందికి తక్కువ కాకూడదు. విధాన పరిషత్తులోని సదస్యుల సంఖ్య మొత్తములో దరిదాపుగా మూడవ వంతు నగరపాలక సంఘములయొక్కయు, జిల్లా మండలుల (బోర్డులు) యొక్కయు, మరియు పార్ల మెంటు విధిద్వారా నిర్దిష్టము చేయునట్టి ఇతర స్థానిక ప్రాధికారముల యొక్కయు సదస్యులతో కూడిన నిర్వా చక వర్గముల చేత ఎన్నుకొనబడవలెను.

దరిదాపుగ పంద్రెండవ వంతు, కనీసము మూడు సంవత్సరములు ఇండియారాజ్యక్షేత్రములోని ఏ విశ్వ విద్యాలయముయొక్కయైన పట్టభద్రునకుగల అర్హత లకు సమానమైనవని నిర్ధారణ చేయబడిన అర్హతలను కనీసము మూడు సంవత్సరములైనను కలిగియుండి, ఆరాజ్యములో నివసించు వ్యక్తులతో కూడిన నిర్వాచక వర్గములచే ఎన్నుకొన బడవలెను.

దరిదాపుగ మూడవ వంతు రాజ్యముయొక్క విధానసభకు చెందిన సదస్యులచేత సదరు సభలో సదస్యులు కాని వ్యక్తులనుండి ఎన్నుకొనబడవలెను.

మిగిలిన సంఖ్య, సాహిత్యము, శాస్త్రము, కళ, సహకారోద్యమము మరియు సాంఘికసేవ విషయము లలో విశేషజ్ఞానము, లేక స్వవహారములందనుభవ మును కల్గిన వ్యక్తులలోనుండి రాజ్యపాలకుని చేత నామనిర్దేశము చేయబడవలెను.

## రాజ్యవిధాన మండలిలో సదస్యతకు అర్హతలు

విధాన మండలికి ఎన్నుకొనబడుటకు అభ్యర్థి పౌరుడై యుండవలెను. విధాన సభలోని స్థానము విషయములో ఇరువదియైదేండ్ల వయస్సుకు తక్కువ గాకుండగను, విధానపరిషత్తులోని స్థానము విషయ ములో ముప్పది సంవత్సరముల వయస్సుకు తక్కువ గాకుండగను అభ్యర్థి ఉండవలెను.

## సదస్యతకు అనర్హతలు

ఈ క్రింద నుదహరింపబడిన తరగతుల వ్యక్తులు విధానమండలియొక్క ఏ ఒక సదనములో సదస్యత కైనను అనర్హులు :

1. ఇండియా ప్రభుత్వము క్రిందగాని, ఏ

రాజ్యము ప్రభుత్వము క్రిందగాని లాభసాటియైన పదవిలో నున్నవారు.

2. చిత్త వికృతి ఉన్నట్లు ఒక ఉచిత న్యాయ స్థానము ప్రకటించినవారు.

3. విడుదలకాని దివాలాదారులు :

4. విదేశ రాజ్యముల పౌరులు :

5. ఇండియా సంసదు (పార్లమెంటు) చేసినటు వంటి ఏ విధి (లా) ప్రకారమైనను అనర్హులయిన వ్యక్తులు.

## విధానమండలి కాలపరిమితి

172-వ విభాగము ప్రకారము ప్రతివిధాన సభయు దాని ప్రథమ సమావేశమునకు నియుక్తమైన తేదీ మొదలు 5 సంవత్సరములవరకు, — అంతకు ముందుగానే రాజ్యపాలకునిచేత విఘటన (డిసాల్వ్) చేయబడిననే తప్ప, పదవిలో యుండవలెను. ఆ అవధి అనంతరము అది ఎవరి ప్రమేయముగాని లేకనే విఘటిత మగును.

రాజ్యముయొక్క విధానపరిషత్తు విఘటన కానేరదు. కాని అందలి సదస్యులలో దరిదాపుగ 3-వ వంతువారు ప్రతి రెండవసంవత్సరము పూర్తి అయిన పిమ్మట, సాధ్యమైనంత త్వరగా, ఇండియా

పార్లమెంటు చేసిన నియమముల ననుసరించి, నివృత్తి (రిటైరు) కావలయును.

## విధానమండలియొక్క శక్తులు - విశేషాధికారములు

194 (3)-వ విభాగము ప్రకారము, ఆంగ్లేయ కామన్సు సదనము అనుభవించుచున్న శక్తులు, విశేషాధికారములను — ఎప్పటప్పటికి అవి విధిద్వారా మార్పుచేయబడుట యటుండగా రాజ్య విధాన పరిషత్తులకు గలవు. ఆ కారణముచేత :

1. సంవిధానము ద్వారా తమకు నిర్ణీతములైన పరిపాలనా విషయములపై చట్టములను శాసనము చేయుటకు (అవి ఎట్టివో తరువాత చూతముగాక) వాటికి అవసరమగు శక్తియున్నది. రెండు సదనము లున్నచోట ఆ రెండింటిచేతను విధినిర్మాణ ప్రస్తావన పత్రములు (బిల్లులు) పారితములు కావలయును. పైగా, మాన్యత (వాలిడిటీ) పొందుటకు అవి రాజ్యపాలకుని లేక రాజ్యప్రముఖునియొక్క సమ్మతిని పొంద వలెను.

2. రాజ్యమును పరిపాలించుటకును, ప్రభుత్వము ప్రజలకు అర్పించునట్టి సేవల [illegible] నిమిత్తము [illegible] ధనము (గ్రాంటులు) ఇచ్చుటకును వాటికి అవసరమగు శక్తియున్నది.

3. సార్వజనిక శ్రేయస్సును సంబంధించిన తీర్మానములను చర్చించుటకు, నిర్ణయించుటకు వాటికి అవసరమగు శక్తియున్నది. ఆ తీర్మానముల లోని నిదేశము ప్రకారము సర్కారు చర్య తీసికొన వచ్చును. కాని సర్కారు అట్లు చేయవలసిన నిర్బంధము లేదు

4. రాజ్యముయొక్క వ్యవహారములను పరిపాలించు సందర్భములో సర్కారును అదుపులో నుంచుటకు, వాటికి అవసరమగు శక్తియున్నది. ఇదంతయు ముఖ్యముగా దినదినము విధానమండలి సమావేశమైయున్నపుడు మంత్రులయొక్క అధికారమునకు లోనైయుండు పరిపాలనావిషయమైన ఏ చర్యల గూర్చియైనను వేయు ప్రశ్నలద్వారా జరుపబడుచున్నది.

## విధానమండలిలోని సదస్యుల హక్కులు, విశేషాధికారములు

విధానమండలి సదస్యులు కేవలము తమను ఎన్నుకొన్న వ్యక్తులయొక్క ప్రతినిధులు మాత్రమే కారు. ప్రజలందరికిని దేశము మొత్తమునకును ప్రతినిధులై యున్నారు. వారందరి శ్రేయస్సులను, నిమిత్తములను ఈ సదస్యులెల్లప్పుడును మనస్సులో నుంచుకొనవలెను. వారేమి చేయుచున్నను వాటిని గురించి శ్రద్ధవహించవలెను. దేశముయొక్క ప్రతి

నిధులుగా ఈ సదస్యులు తమ ధర్మములు నిర్వర్తించు టలో వారిని శక్తిమంతులుగా చేయుటకు వారికి కొన్ని హక్కులు, విశేషాధికారములు ఇవ్వబడినవి. వాటిలో ప్రధానములైనవి ఇవి :

1. వాక్కు స్వాతంత్ర్యము : స్వతంత్ర దేశ ములో స్వతంత్ర విధానమండలి సదస్యుడు సార్వజనిక వ్యవహారముల గూర్చి నిర్భయముగా మాట్లాడుటకు స్వేచ్ఛగలిగి యుండవలెను. వానిపై నెట్టి చర్యను తీసికొనరాదు. అనగా అతడు విధానమండలిలో నేమి చేసినను, చెప్పినను అతనిపై న్యాయస్థానములో అభి యోగము (ప్రోసిక్యూషను) తేరాదు. విధాననిర్మాణ ప్రస్తాపనలను చేయుటకును, తీర్మానములను ప్రవేశ పెట్టుటకును సార్వజనిక క్షేమముగురించిన విషయముల పై ప్రశ్నలవేయుటకును అతనికి అధికారము కలదు.

2. అరెస్టు కాకుండుటకు స్వాతంత్ర్యము : విధానమండలి సమావేశమై యున్నపుడు సదస్యులు సభలకు పోవునపుడుగాని, వాటినుండి వచ్చుచున్నప్పుడు గాని ఏ సర్కారు ఉద్యోగస్థునిచేతను అరెస్టు చేయబడ రాదు. అయితే, ఇట్టి ఉన్ముక్తి (ఇమ్యూనిటీ) దండనీయమగు అపరాధములకు వర్తించదు.

## విధానమండలి సంఘటన, ప్రక్రియ (ప్రొసీజరు) కార్యకలాపము

ఏ సంస్థ అయినను కార్యసిద్ధి నొందవలెనన్న దాని సంఘటన యుక్తముగా నుండవలెను. విధాన మండలి సందర్భములో యథార్థముగా దానియొక్క శక్తికంటే, దాని సంఘటనమే ఎక్కువ ముఖ్యమైనది. చక్కగా సంఘటింపబడిన విధాన మండలి, దానికి ప్రథమమున కొలది శక్తులే లభ్యమైయున్నను, ఒకటి తరువాత నొకటిగా క్రొత్తశక్తులను ఆర్జింపగలదు. ఆంగ్లేయ కామన్సు సదనముయొక్క చరిత్రయే దీనికి ఋజువు. బాగా పరిణతిపొందిన విధానమండలికి గల శక్తులన్నింటిని చేకూర్చుకొన్నను, చెడ్డగా సంఘటింప బడిన విధానమండలి వాటిని ఒకటి వెంబడి నొకటిగా పోగొట్టుకొనును. ఫ్రెంచి విప్లవకాలపు విధానమండలులకు ఈ విధముగానే జరిగినది. అవి దోషములతో కూడిన సంఘటన, ప్రక్రియ కలిగియుండుటచేతనే వాటి ధర్మములను నిర్వర్తింపలేకపోయెను. తుదకు నెపోలియను వాటి శక్తులను తొలగించివైచెను.

## విధానమండలుల ఆంతర్యమగు సంఘటన

విధానమండలి యొక్క కార్యకలాపమును క్రమపద్ధతిలోను, మర్యాదతోను, సమర్థతతోను నిర్వహించుటకును, దాని సమావేశములలో అధ్యక్షత

వహించుటకును ఒక ఉద్యోగి యుండవలెను. విధానసభా సందర్భములో, ఆంగ్లేయ కామన్సు సదనము యొక్క సంప్రదాయము ననుసరించి, ఈయనను అధ్యక్షుడు (స్పీకరు) అందురు. విధానపరిషత్తు సందర్భములో ఈయనను సభాపతి (ప్రెసిడెంటు) అందురు. విధానమండలి యొక్క సమావేశములకు ఆయన అధ్యక్షత వహించును. కార్యకలాపము నంతయు సక్రమముగాను, సాఫల్యముగాను నడిపించుటకు కావలసిన శక్తులన్నియు ఆయన కున్నవి. ఆయన సదస్యు లందరికును మాట్లాడుటకు అవకాశమిచ్చును. అయితే, అల్పసంఖ్యాకులకును, ఏ పక్షమునకుగాని చెందని స్వతంత్ర సదస్యులకును ఈ అవకాశములో న్యాయమైన వంతు ఉండునట్లు ఆయన జాగ్రత్త పడును. సక్రమమైన చర్చా నియమములను అతిక్రమించిన సదస్యులను విమర్శించి వారిని సరియగు మార్గములోనికి త్రిప్పును. అందరియెడల అభిమానము కలిగియుండి, వివాదపడుచున్న సదస్యులమధ్య నిష్పాక్షికముగా న్యాయము జరుగునట్లు చూచును. విధాన మండలియొక్క కార్యకలాపమును నిర్ణయించునట్టి ప్రక్రియా నియమములను ప్రతియొక సదనము దానికదే నిర్ణయించుకొనును. ఆ నియమములను అధ్యక్షుడు పాటించి అమలు జరుపును.

## విధానమండలిలో ప్రక్రియ

ఈ ప్రక్రియ ఆంగ్లేయ కామన్సు సదనము యొక్క ప్రక్రియపైన ఆధారపడియున్నది.

1. ప్రశ్నల కాలము : దినదిన పరిపాలన విషయమై సదస్యులు మంత్రులకు ప్రశ్నలవేయుటతో విధానమండలి సమావేశములు సాధారణముగా ప్రారంభమగును.

2. తీర్మానములు : విధానమండలిలో ప్రతి యొక చర్చయు ఏదైన నొక విషయముగూర్చి సమాలోచన చేయవలసినదని తెచ్చిన తీర్మానము, లేక ప్రస్తావము (మోషను) మీద ఆధారపడియుండును. లేదా, ఒక మంత్రిగాని, సాధారణసభ్యుడుగాని చేసిన శాసనప్రస్థాపనపై ఆధారపడియుండును. ఏదైన జనులందరకు ముఖ్యమైన అత్యవసర విషయముపై వాదోపవాదము చేయవలసియున్న యెడల, ఆ విషయముపై శ్రద్ధ వహించియున్న సదస్యుడు సాక్షాత్తు సదనము యెదుట నుంచబడిన కార్యమునకు అవధిదానము (ఎడ్జెర్న్మెంటు లేక వాయిదా) చేయుమని కోరుచు ప్రస్తావమును పెట్టవచ్చును. ఆ ప్రస్తావమును అధ్యాసీన అధికారి (ప్రిసైడింగు ఆఫీసరు) అంగీకరించిన యెడల, దానిపై తర్కించుటకు వీలగును.

3. బిల్లులు : ప్రతి శాసనప్రస్తాపనయు మూడు

దశలద్వారా సాగిపోవలెను. వాటికి బిల్లుయొక్క మూడు పఠనములని పేరు.

4. మొదటి పఠనము : లాంఛనంగా బిల్లును సమర్పించుట: సభాకార్యదర్శియు, అతని సహాయకులును ఆసీనులైయున్న విధానమండలి మధ్యభాగమున మేజాబల్లపై బహుక్లుప్తముగా వ్రాసిన రూపములో బిల్లును ఉంచెదరు.

5. రెండవ పఠనము : అపుడు బిల్లులోని సూత్రములను కొంత వివరముగా విచారించెదరు.

6. మూడవ పఠనము : ఒక ప్రత్యేకసమితి (సెలక్టు కమిటీ) కి నిర్దేశింపబడిన తరువాత కాని, దానితో ప్రసక్తి లేకుండగా కాని, బిల్లు దాని ఆఖరు దశను దాటిపోకలదు. ప్రవరసమితి బిల్లులోని వివరముల నన్నింటిని పరిశీలించి, దానిపై విధానమండలికి నివేదికను సమర్పించును. అపుడు బిల్లు పారితమగును; లేదా నిరాకరింపబడును.

7. రాజ్యపాలకుని (గవర్నరు) సమ్మతి : విధాన మండలి పారితముచేసిన బిల్లు, రాజ్యపాలకుడు తన సమ్మతి నొసంగిన పిమ్మట, చట్టమగును.

8. డబ్బు బిల్లులగూర్చి ప్రత్యేక ప్రక్రియ : ప్రభుత్వబలమునకు మూలము ధనము. సర్కారు ఖర్చు చేయునది ప్రజలధనము. కనుక డబ్బు

బిల్లుల సందర్భములో ప్రత్యేక ప్రక్రియను అవలంబింతురు. దానియొక్క ముఖ్యలక్షణములు ఇవి :

1. వాటియొక్క ఉపక్రమణ (ఇనిషియేషన్) సర్కారు మాత్రమే చేయదగును. డబ్బు బిల్లుల రూపమున కావింపబడిన పన్నులను, వ్యయమును గూర్చిన ప్రస్తావనలను సర్కారు మాత్రమే ఉపక్రమింపవలయును. విధానమండలి సొంతముకాని, ఏ ఒక సదస్యుడైనగాని ఉపక్రమణ చేయరాదు. వ్యయమును పెంచమనిగాని, క్రొత్తపన్ను విధించమనిగాని, వీరు ప్రస్తావన చేయరాదు. కాని వ్యయమును తగ్గించమని కోరవచ్చును. దీనికంతకు కారణమేమనగా పన్నుల వసూలు చేయుటకు బాధ్యులై యుండుట చేతను, పరిపాలన గూర్చిన అక్కరలను బాగుగా నెరిగి యుండుట చేతను, దానికి బాధ్యులగుట చేతను, అటువంటి ప్రస్తావనల చేయుటకు ప్రభుత్వమునకుమాత్రమే అధికార ముండవలయును.

2. విధాన సభలో ఉపక్రమణ : ఎక్కడ రెండు సదనము లుండునో అక్కడ డబ్బు బిల్లులను విధాన సభలో ఉపక్రమింపవలెను. అనగా మొదట ప్రవేశపెట్టవలెను. ఎందుకనగా, జనులందరికి అది ప్రతినిధి గనుక. అయితే విధానపరిషత్తు ఉన్నచోట దానిచేతనుగూడ బిల్లు పారితము కావలెను. విధాన

సభచేత పారితములైన ధన ప్రస్తావనలలో ఏదైన మార్పును విధాన పరిషత్తు కోరవచ్చును. కాని విధానసభ దానిని అంగీకరించి శాసనములో చేర్పనిచో విధాన పరిషత్తు కోరిన మార్పుల కెట్టి ప్రభావము (ఇఫెక్టు) ఉండబోదు.

౩ ధన విధేయక (ఫైనాన్సుబిల్) రూపము లోను, రాజ్యముయొక్క వార్షిక ఆదాయ, వ్యయ పట్టీ (బడ్జెటు) రూపములోను చేయబడిన పద్దుల, వ్యయములగూర్చిన ప్రస్తావనలు ప్రతి సంవత్సరము, రాబోయే సంవత్సరమునకై, పారితములు కావలెను. కాని యీ క్రింద నుదహరింపబడిన వ్యయమునుగూర్చిన పద్దులు ఓటుద్వారా పారితములు కానక్కరలేదు. శాశ్వతముగాను, ఓటుతో నిమిత్తము లేకుండగాను, వాటి భారము (చార్జి) సంచితనిధి (కన్సాలిడేటెడ్ ఫండు) అనబడు రాజ్యముయొక్క ఆదాయముల మొత్తముపై నుంచబడును.

(1) రాజ్యపాలకుని, వారి సిబ్బంది, ఆఫీసుల ఉపలబ్ధులును (ఇమాల్యుమెంట్సు) బత్తాలును (అలవెన్సులు);

(2) విధాన సభయొక్క అధ్యక్షుని, ఉపాధ్యక్షుని, విధానపరిషత్తుయొక్క సభాపతి, ఉప సభాపతులయొక్క వేతనములు, బత్తాలును;

(3) ఉచ్చ న్యాయస్థానమందలి న్యాయాధీశుల వేతనములు, బత్తాలున్ను;

(4) న్యాయస్థానముల తీర్పులను జరిపించుటకు కావలసిన మొత్తములును.

(5) వడ్డీ, విమోచనభారములు (రిడెమ్షన్ చార్జీలు), మరియు ఇతర అప్పుల భారములు కలసి, రాజ్యము తీర్చవలసియున్న ఋణభారములున్ను;

(6) శాశ్వతమగు ప్రయోజనముల కొరకై కేటాయింపుచేయబడి రాజ్యపుసంచిత నిధిపై వేయ తగిన భారములని రాజ్య విధానమండలిగాని సంవిధానముగాని ప్రకటించిన ఇతర భారములున్ను.

వార్షికముగా విధానమండలి వేయు ఓటునుండి ఈ పద్దులను మినహాయించుటలో గల భావమిది. రాజ్యముయొక్క పరపతితో సంబంధించిన ఉద్యోగముల, సేవల తరపున ఈ ఖర్చు పద్దులు ఏర్పడినవి. లేదా, స్వాతంత్ర్యరక్షణకై నిష్పక్షపాతము, నిర్యోగమాటము అవలంబించవలసిన ఉద్యోగములను భద్రపరచుటకై ఏర్పడినవి.

## మంత్రి పరిషత్తులోని కార్యపాలక వర్గము

పౌరుల ప్రతినిధిగా విధానమండలి, రాజ్యమును పరిపాలించుటకు వలసినవిధులను పారితము చేయుటకును,

ఏ సామాన్యవిధానము ప్రకారము రాజ్యముయొక్క పరిపాలనను సాగింపవలసియున్నదో దానిని సూచించుటకు లేక బలపరచుటకును, అధికారము, శక్తియు కలిగియున్నది. అటులనే రాజ్యముయొక్క రాజస్వమును (రెవెన్యూ) వసూలు చేయుట, రాజ్యముయొక్క శాంతి, భద్రతలను కాపాడుట, విద్య, ఆరోగ్య, సామాజిక సేవలను ఏర్పాటుచేయుట మొదలైన రాజ్యపు వ్యవహారముల కార్యనిర్వహణకు (ఎడ్మినిస్ట్రేషను) కార్యపాలక వర్గము పూనుకొనుచున్నది.

సంవిధానమందలి 104-వ విభాగ ప్రకారము నియుక్తుడైన రాజ్యపాలకుడు (గవర్నరు) ఈ కార్యపాలక వర్గమునకు అధిపతి. ఈ విభాగము చెప్పినట్లు, రాజ్యముయొక్క కార్యపాలక శక్తి రాజ్యపాలకునకు స్వాధీనము చేయబడినది. అది స్వయముగా ఆయన ద్వారాగాని, ఆయన కధీనులగు ఉద్యోగస్థుల ద్వారా గాని ఆచరణీయమైనది. సంవిధానములో చెప్పబడి యున్నట్లు, ఆయనకు గల అధికారమును చెలాయించుటలో రాజ్యపాలకునకు సహాయము చేయుటకు, సలహానిచ్చుటకును ప్రతి రాజ్యములోను ఒక మంత్రి పరిషత్తు కలదు దానికి ముఖ్యమంత్రి నాయకుడు. రాజ్యపాలకుడు ముఖ్యమంత్రిని నియమించును. ముఖ్యమంత్రి సలహాప్రకారము ఇతర మంత్రులను నియ

హించును. రాజ్యపాలకుని అంగీకార పర్యంతము మంత్రులు పదవిలోనుందురు. అనగా, విధానసభకు వారిలో నమ్మకమున్నంత వరకు మంత్రుల కుద్యోగ ముండును.

## బాధ్యతాయుతమగు మంత్రివర్గము

రాజ్యముయొక్క విధానసభకు మంత్రి పరిషత్తు సమిష్టిగా బాధ్యతకలదై యుండవలెనని సంవిధానము లోని ముఖ్యమగు 164-వ విభాగము ఆదేశించు చున్నది దీనికే "సమిష్టి బాధ్యతా సూత్ర" మని పేరు. రాజ్యముల ప్రభుత్వ పద్ధతిలో దీనిని ప్రవేశ పెట్టియున్నారు. ప్రతి యొక మంత్రియును ఒకొక్క పరిపాలనా శాఖ పనిని చూచుకొనుచుండును. ఆ కార్యమునకు ఆయన వ్యక్తిగతముగా బాధ్యుడై యుండును. అట్లయ్యును ఈ సూత్రప్రకారము, ఆయన వ్యక్తిగత బాధ్యతకు అదనముగా, తనదేగాక ఇతర పరిపాలనాశాఖలలో జరిగినటువంటి విశేష ప్రాముఖ్యము గల, ఏ విషయములోనైనను ఇతరమంత్రులతో పాటు బాధ్యతను పంచుకొనును. ఇట్లు మంత్రివర్గము ఏకైక మగు నికాయమగును. రాజ్యపాలకుని సందర్భము లోను, విధానమండలి సందర్భములోనుకూడ అది ఏకైకమగు నికాయమే.

ఈ ప్రకారముగా, మంత్రివర్గము బాధ్యతా యుత మంత్రివర్గము. అయితే, ఎవరికి బాధ్యతకలదై యున్నది? మంత్రులు విధానపరిషత్తునకుగాక, విధాన సభకుమాత్రమే బాధ్యత వహించియున్నారని 164–2 వ విభాగము చెప్పుచున్నది. "విధాన సభలోని అధిక సంఖ్యాకులకు బాధ్యత" అని దీనిలో అంతరార్థము ఇమిడియున్నది. ఎందుకనగా, ప్రజాస్వామ్యములగు ప్రభుత్వములలో సార్వజనీనము వ్యవహారములందును, అట్టి వ్యవహారములు గూర్చిన చర్చలలోను పాల్గొనిన, అధిక సంఖ్యాకులగు సదస్యులకొలక్కి— ఓట్లచేత నిర్ణయములు జరుపబడును. ఎన్నికలందుగాని, విధాన మండలిలోగాని ఇట్లే నిర్ణయములకు వత్తురు. గనుక, విధాన సభలోని అధిక సంఖ్యాకులకు మంత్రి వర్గము బాధ్యత వహించియున్నది. వీరు, అంతకు పూర్వము జరిగియున్న సాధారణ ఎన్నికలలో సూచితమై యున్నట్లు, ఓటర్లలో అధిక సంఖ్యాకులకు ప్రతినిధులు అని మనకు తెలిసియే యున్నది.

అందుచేత తనకు ఇష్టుడగు వానిని ముఖ్యమంత్రిగా ఎన్నుకొనుటకై రాజ్యపాలకునకు స్వాతంత్ర్యము లేదు. విధాన సభలో ఏ పక్షము అధిక సంఖ్యాకమై యున్నదో ఆ పక్షమునుండియే ఆయన ముఖ్యమంత్రిని ఎన్నుకొనవలసి యున్నది. ఈ అధిక

సంఖ్యాకులనుండియే ముఖ్యమంత్రి తన సాటి మంత్రులను కూడ ఎన్నుకొనవలసి యున్నది. ఎందుకనగా, వారందరు కలిసి పనిచేయవలసి యున్నది. ఆయన, వారును సమిష్టిగా విధానసభకు బాధ్యులై యున్నారు. ఎన్నికలలోని ఫలితముల ప్రకారము, విధాన సభలోని అధిక సంఖ్యాకులు వీరియందే నమ్మకము కలిగియున్నారని రాజ్యపాలకునకు నిశ్చితాభిప్రాయ ముండుటచేతనే వీరు మంత్రులగుదురు. పైగా, ఈ నమ్మకమును పోగొట్టుకొనిన తోడనే అనగా, విధానసభలోని అధిక సంఖ్యాకుల ప్రాపును కోల్పోయిన వెంటనే వీరు మంత్రి పదవినుండి తొలగిపోవుదురు.

ముఖ్యమంత్రిని మనము కేవలము అకారణముగా ముఖ్యమంత్రి అని పిలుచుటలేదు. ఆయన మంత్రి పరిషత్తునకు అధిపతి. సాటి మంత్రులను ఎన్నుకొనును. ఆయనకు సంవిధాన మిచ్చిన ఈ అధికార ఫలితముగా ఆయనకు వారిలో ఏ ఒకరి యొక్క, లేక అందరియొక్క సేవలను నిరాకరించుటకు అధికారము కలదు. మంత్రి పరిషత్తునకు అధిపతి యగు ఈ ముఖ్యమంత్రి భుజస్కంధముపై పరిపాలనా విధానమను నిర్మాణ మంతయు ఆధారపడియున్నది.

ఇట్టి కార్యపాలకవర్గ ప్రభుత్వ పద్ధతికే కాబినెట్ ప్రభుత్వమని పేరు. దీనికే పార్లమెంటుచేత

నియుక్తమగు కార్యపాలకవర్గ ప్రభుత్వమని కూడ పేరుకలదు. దీనికిని రాష్ట్రపతిచేత నియుక్తమగు కార్యపాలక ప్రభుత్వమునకు భేదమున్నది. ఈ రెండవ పద్ధతి అమెరికా సంయుక్త రాష్ట్రములందును, ఆ దేశమునుండి దానిని తెచ్చుకొనియున్న మరికొన్ని ఇతర దేశములలోను అమలులోనున్నది. రాష్ట్రపతి నియుక్తమగు పద్ధతి ప్రకారము ప్రజలచే ఎన్నుకో బడిన రాష్ట్రపతి మంత్రులను నియోగించును. వారు ఆయనకే బాధ్యులు. ఆయనే వారిని పదవినుండి తొలగించ వచ్చును. వారు విధాన మండలిలో సదస్యులు కారు. దానికి బాధ్యులును కారు. ఇది యిట్లుండగా, పార్లమెంటు నియుక్తమగు కార్యపాలక పద్ధతిలోని విశేషగుణ మేమనగా, మంత్రులు విధాన మండలిలో సదస్యులగుటయు, దానికి బాధ్యులై యుండుటయును.

పార్లమెంటుచే నియుక్తమగు పద్ధతిలో పెక్కు లుగా లాభములున్నవి. వాటి మూలముననే దానిని సర్వసామాన్యముగ ప్రజాస్వామ్యములగు దేశములలో నవలంబించియున్నారు. విధానమండలిలో మంత్రులు సభ్యులై యుండుటవలన కార్యపాలక వర్గమునకు విధానమండలికిని నిత్యము సంబంధ బాంధవ్యము లుండును అందువలన ప్రభుత్వము నిరాటంక

ముగా సాగును. మాటలచేతను, ఒప్పించుటకు కావలసిన రాజీనామా నిత్తుమని భయ పెట్టుటవంటి ఇతర మార్గములచేతను, తాను ప్రతిపాదించిన పన్నుల వేయుటకును, విధుల నిర్ణయించుటకును మంత్రులు విధానమండలిని ఒప్పించుటకై ఎంతో వీలున్నది. రాజీనామా దండనమూలముగా మరొక ఎన్నిక సంభవింపవచ్చును. తత్ఫలితముగా వేరొక పక్షము అధిక సంఖ్యతో అధికారములోనికి రావచ్చు ననెడి ప్రమాదమున్నది. దినదినము విధానమండలి సమావేశమైయున్న సమయములలో వారివిధానము యొక్క, పరిపాలనా చర్యలయొక్క అర్థమును విధాన మండలికి, తద్ద్వారా సాధారణ ప్రజకు వివరించి చెప్పుటకు వారికి అవకాశముండును. అది అటుంచి, సార్వజనీయ వ్యవహారములకు, పరిపాలనకు సంబంధించిన ప్రజల కష్టముల చెప్పికొనుటకు, కోరికల నివేదించుటకును ఈ ప్రజాప్రతినిధులకు అవకాశము లుండును. పరిపాలనయందలి చిన్నచిన్న చర్యలను, ప్రజలను బాధించు అల్పోద్యోగుల నిరంకుశ చేష్టలను సమీక్షించుటకును, ఖండించుటకును విధానమండలి లోని సభ్యులకు విధానమండలి కార్యక్రమ మందలి ప్రశ్నల కాలములో అవకాశము లభించును.

సంవిధాన చట్టము ప్రకారము రాజ్యపాలకుడు కార్యపాలక వర్గమునకు అధిపతియైనను, మంత్రులు ఆయనకు సలహానిచ్చువారే యైనను, ఆ సంవిధాన చట్టప్రకారమే మంత్రులందరు విధానమండలికి బాధ్యులనియు, రాజ్యపాలకుడు కేవలము పేరునకు మాత్రమే కార్యపాలక వర్గమునకు అధిపతి అనియు, మనము గమనింప తగును. ఆయన సలహానిచ్చును; హెచ్చరించును; లేక ఒప్పింప ప్రయత్నించును; అంతి మాత్రమే. కడపటి నిర్ణయమును గావించుట మంత్రులకే వదలివేయును. వారే విధానమండలికిని ప్రజలకును బాధ్యులగుటయే దీనికి కారణము. ఆయనను రాష్ట్రపతి నామనిర్దేశము (నామినేటు) చేసియున్నాడే కాని, ఆయనను ప్రజలు ఎన్నుకొనలేదు కదా.

సంవిధానము రాజ్యపాలకునకు అధ్యాదేశము (ఆర్డినాన్సులు) లను ప్రకటించు శక్తినిచ్చియున్నమాట నిశ్చయమే. విధానమండలి విరామ సమయములందు ఈ అధ్యాదేశములకు విధి (లా) కున్న బలమంతయు కలదు. దీని కంతయు కారణ మేమనగా, విధాన మండలి నిర్ణీత సమయములందే కాని ఎల్ల వేళల సమావేశమై యుండదు. సంవత్సరమునకు రెండు పర్యాయములకు తక్కువ కాకుండగను, సార్వజనీయ వ్యవహారము నిమిత్తము ఎంత త్వరత్వరగా సభలు జరుపవలయు

వని మంత్రివర్గము అభిప్రాయ పడుచున్నదో అప్పుడును, అది కలుసుకొనును. సత్వరము తగినచర్యను తీసి కొనవలసిన అగత్యమును కల్గించిన పరిస్థితులు ఏర్పడిన వని తోచిన తోడనే రాజ్యపాలకుడు ఈ అధ్యాదేశ ములను విడుదల చేయును. విధి (లా) నిర్మాణమం దిట్టి అసాధారణశక్తి ఆయనకున్నను రాజ్యపాలకుడు మంత్రి వర్గము తరఫున మాత్రమే ఈ అధికారమును చెలా యించును.

## మంత్రివర్గము - పరిపాలన

రాజ్యమందలి ఉచ్చతమ కార్యపాలకవర్గముగా మంత్రివర్గము ఏర్పడి యున్నను, కార్యపాలకవర్గ మంతయు వారితోనే నిండి యుండదు. వారు కొద్దిమంది మాత్రమే. అతి విశాల రాజ్యములోకూడ వారు 15 గురికి మించియుండరు. విధానమండలి పారితము చేసిన విధులను అమలులో పెట్టుట, ప్రతినిధిసభలు మంజూరు చేసియున్న పన్నులను వసూలుచేయుట, రాజ్యములో శాంతిభద్రతలను కాపాడుట, విద్యలను, ఇతర సామాజిక సేవలను రాజ్యములో నేర్పాటు కావించుట మొదలగు పనులన్నింటిని వారంతట వారే నిర్వహించుకొనలేరు. ఈ కార్యమంతయు చేయుటకు ఒక పెద్దఉద్యోగుల సైన్యమే కావలసి యున్నది.

వారందరును కలిసి పాలకవర్గము, లేక పరిపాలనా సేవకులు అగుదురు. మంత్రులకు భోగట్టాను, సూచనలు, సలహాలను ఇచ్చునట్టి రాజధానిలో కార్యదర్శిక సిబ్బంది (సెక్రేటేరియట్) కి చెందిన ఉద్యోగులనుండి, కట్టకడపట గ్రామ మునసబు, కరణముల వరకు అనేక తరహాలవా రున్నారు. వీరిలోనె రెవిన్యూ, పోలీసు, విద్య, ఆరోగ్యము, వ్యవసాయము, పరిశ్రమలు మొదలగు పరిపాలనా శాఖలకు చెందిన ముఖ్యులతో సహా రాజధానియందే ఉన్నటువంటి ఉద్యోగులును, వీరికి తోడుగా జిల్లా కలెక్టరు, పోలీసు సూపరింటెండెంటు, జిల్లా విద్యాధికారి, జిల్లా రెజిస్ట్రారు మొదలైన ఉద్యోగులును కలరు.

కార్యనిర్వాహక వర్గమునకు మంత్రిపరిషత్తు శిరస్సు వంటిది అయినయెడల, ఈ పరిపాలనా శాఖల ఉద్యోగస్థు లందరును ప్రభుత్వమునకు చేతులు, కాళ్ళు వంటివారు. రాజ్యము యొక్క వ్యవహారమునంతను మంత్రులయొక్క ఆజ్ఞలను గైకొని, వారి ఆదేశ ప్రకారముగా, వారి సాధారణ అధీనమున (సూపర్విజను) క్రింద ఈ ఉద్యోగులే నడిపింతురు. ఈ వ్యవహారమందలి భాగము లేవనగా: శాంతిభద్రతలను కాపాడుట, రెవిన్యూను వసూలుచేయుట, ప్రభుత్వము

ప్రజలకై సిద్ధపరచిన విద్య, ఆరోగ్య, వ్యవసాయిక, పారిశ్రామిక సేవలను సమకూర్చుట మొదలైనవి.

ఈవిధముగా నిట్టి అధీనపు, లేక అత్యవసరపు ప్రభుత్వ కార్యమంతయు విరామము లేకుండగా జరుగ వలసియున్నది. పైగా సేవలన్నియు సమర్థతతో సాగవలసి యున్నవి అందుచేతనే, ఈ ఉద్యోగస్థుల నియామకము శాశ్వతముగా నుండవలయును. మంత్రు లతో వీరిని పోల్చరాదు ఎన్నికలలో జయాప జయముల బట్టియు, ముఖ్యమంత్రి అనుగ్రహముబట్టి యును మంత్రులు అప్పటి కప్పుడు మారుచుందురు. ముఖ్యమంత్రికూడ విధానమండలిలోని అధిక సంఖ్యా కులపై ఆధారపడియుండును. కాని, ఉద్యోగులకు మాత్రము వారి పదవుల అవధి నిశ్చయమని హామీ యివ్వవలెను; వారు కాయశక్తుల రాజ్యమునకై పాటుపడుటకును, తృప్తిచెంది యుండుటకును, రాజ్యమునెడ తమ ధర్మమును నిర్వర్తించు ఋజు మార్గమునుండి వారిని తప్పించుటకై వారిపైకి వచ్చు రాజకీయ సాంఘిక ప్రభావములనుండి విముక్తు లగుటకును, సరిపోవునట్లు జీతములివ్వవలెను. ఇట్టి పరిపాలనాపద్ధతిని, పరిపాలనాసేవలను స్థాపించుటకును పోషించుటకును తగిన ఏర్పాటు చేయు విషయముగను సంవిధానము ఎంతమాత్రము మరువరాదు.

# లోకసేవాయోగము

## (పబ్లిక్ సర్వీసెస్ కమిషన్)

సంవిధానమందు 309-వ విభాగ ప్రకారము రాజ్యములోని సేవలయొక్క నియామకము, మరతు లును ఆ రాజ్యపు విధానమండలి పారితము చేసిన విధుల చేత శాసింపబడుచున్నవి; అంతేకాని, మంత్రి వర్గముయొక్క ఇష్టాయిష్టములమీద ఆధారపడియుండ లేదు. 309-వ విభాగప్రకారము రాజ్యమందలి తాత్కాలిక ఉద్యోగులు కాక, శాశ్వతపు ఉద్యోగుల యొక్క పదవుల అవధి రాజ్యపాలకునియొక్క, లేక రాజప్రముఖునియొక్క అంగీకార పర్యంతము ఉండ గలదు; దీనికి 'ఉద్యోగస్థుల సత్ప్రవర్తన పర్యంతము' అని అర్థము. ఇది ఇండియా తెచ్చుకొనిన ఒక ఆంగ్ల ఆచారము. రాజ్యముయొక్క సేవలతో నియుక్తుడై యున్న ఏ వ్యక్తియైనను, అతను ఏ ప్రాధికారముచే నియుక్తి చేయబడెనో, దానికి అధీనమైన ప్రాధికారముచే పదచ్యుతి చేయబడ కూడదు. ఈ నియమమువలన ఉద్యోగులయొక్క పదవుల అవధి (కాలపరిమితి) రక్షణకు ఏర్పాటు చేయబడి యున్నది.

రాజకీయ, విశేషించి పక్షప్రభావములకు లోను గాకుండ పరిపాలనా సేవలను కాపాడుటకుగాను ఒక

లోక సేవాయోగము (పబ్లిక్ సర్వీసెస్ కమిషను) ను స్థాపించి యున్నారు. పరిపాలనా సేవల గురించిన, లేక ఒక్కొక్క పదవి గురించిన నియామక పద్ధతుల విషయములలో మంత్రివర్గము ఈ ఆయోగముతో సంప్రదించవలసి యున్నది; పరిపాలనా సేవలకు మొదటి సారి ఉద్యోగములు వేయుటలో పాటించవలసిన సూత్రముల గూర్చి సంప్రదించవలెను; సేవల తరహాలలో నొకదానినుండి ఇంకొకదానికి బదిలీ చేయుట కును, హోదా హెచ్చించుటకును. అట్టి బదిలీలు హోదా హెచ్చింపులు, నియోగముల విషయములలో అభ్యర్థుల యోగ్యత గూర్చియు, సంప్రతించ వలయును. పైగా రాజ్య ప్రభుత్వముక్రింద పనిచేయు చున్న వ్యక్తులకు సంబంధించిన క్రమశిక్షణ చర్యల గూర్చియు; వాటిలో ముఖ్యముగా అర్జీలు, విజ్ఞాపనల గూర్చియు; ఉద్యోగ ధర్మములో చేసిన కార్యముల నిమిత్తముగా న్యాయస్థానములలో వారిపై వ్యాజ్యములు వేసినప్పుడు వారు తమను ప్రతిరక్షించుకొను టకై అయినటువంటి ఖర్చులను తిరిగి రాబట్టుకొనుటకు కావించిన విన్నపములను గూర్చియు; వేసిన జరిమానాలలో తిరిగి ముట్టవలసిన సొమ్ముల గూర్చియు; మంత్రివర్గము లోకసేవా యోగముతో సంప్రతించ వలసి యున్నది.

పరిపాలనలోని ఉద్యోగములలో అధికసంఖ్యపై ఆ యోగముయొక్క అధికారము విస్తరించియున్నది. అయినను, ఆ యధికారమునుండి కొన్ని ఉద్యోగ శ్రేణులు మినహాయించబడినవి. కారణ మేమనగా, వాటిలో కొన్ని తాత్కాలిక పదవులు; కొన్ని సైనిక సిబ్బందిని కొంతవరకు పోలియున్న అధీన (Subordinate) పోలీసు శాఖవంటి ఉద్యోగములు.

సంవిధానములందు 316 వ విభాగ ప్రకారము లోకసేవాయోగము స్వతంత్రముగా నుండుటకు ఏర్పాటు చేయబడినది. ఆ యోగముయొక్క సభ్యులును, దాని సభాపతియును రాజ్యపాలకునిచేత, లేక రాజప్రముఖునిచేత నియుక్తులు కావలసియున్నది. 317 వ విభాగ ప్రకారము వారి ఉద్యోగపు అవధి కాలములో వారిని పదవినుంచి తొలగింపరాదు. అయితే, ఇండియా ఉచ్చతమ న్యాయాలయ మిచ్చిన సలహాప్రకారముగనైనను; వారు దివాలాదారులని తీర్పు అయినను, వారి ఉద్యోగపు అవధి కాలములో ఉద్యోగధర్మముల నతిక్రమించి ఏదైన జీతమునకై పనిలో ప్రవేశించియున్నను; దేహ మనో దౌర్బల్యములచేత ఉద్యోగము చేయుటకు అసమర్థులని రాష్ట్రపతి అభిప్రాయపడినను; వారిని పదవీచ్యుతులను చేయవచ్చును. వారు, మొదట నియుక్త

లైన లోకసేవా యోగములు కాక ఇంకొక ఆయోగములో సదస్యులగుటకు తప్ప మరి ఏ యితర ఉద్యోగముల కును అనర్హులు.

## న్యాయపాలక వర్గము

### (జ్యుడిషియరీ)

ఇంతవరకు విధినిర్మాణ, కార్యపాలక శక్తుల గూర్చి తెలిసికొనియున్నాము. ఇక ముందు న్యాయ పాలక శక్తిపై మన దృష్టిని మరల్చెదము. స్వతంత్ర మగు ప్రతి రాష్ట్రములోను న్యాయపాలకశక్తి ఇతర శక్తులనుండి విడివడి స్వేచ్ఛ కలిగియున్నదని మనము గ్రహించియే యున్నాము. సంవిధానమందలి 214 వ విభాగము ప్రతి రాజ్యములోను ఒక ఉచ్చ న్యాయా లయము (హైకోర్టు) ఉండవలెనని ఆదేశించియున్నది. 215 వ విభాగ ప్రకారము ప్రతి ఉచ్చ న్యాయస్థాన మును అభిలేఖ (రికార్డు) న్యాయస్థానముగ నుండ వలెను. అనగా, దానియొక్క తీర్పులు, సలహాలు వగైరా చర్యలను రికార్డు చేయవలసియున్నది; అవి సాక్ష్యముగా చెల్లగలవు. దాని గౌరవమును, ఆజ్ఞ లను, కార్యములను అవమానించిన వారిని శిక్షించు టకు కావలసిన శక్తులన్నియు దానికి సంక్రమించును.

ఈవిధముగ రాజ్యమునయొక్క క్షేత్రములో
బయలుదేరిన విచారణీయములగు వాదము లన్నింటిపై సను
ఈ ఉచ్చ న్యాయస్థానములకు క్షేత్రాధికారము కలదు.
మదరాసు న్యాయస్థానమువంటి ఉచ్చ న్యాయాలయ
ములకు ప్రారంభిక క్షేత్రాధికారముకూడ కలదు;
అనగా, మదరాసు మహాపట్టణములో సంభవించిన
విషయములగూర్చిన కేసులను మొట్టమొదటిసారి పట్టు
టకు అధికారము కలదన్నమాట వీటికి అధీన
న్యాయస్థానములనుండి అప్పీలువిూదవచ్చిన కేసుల
సందర్భములో అప్పీలు క్షేత్రాధికారముకూడ కలదు.
బందీ ప్రత్యక్ష, పరమాదేశ, ప్రతిషేధ, అధికార
పృచ్ఛ, ఉత్ప్రేక్షణ లేఖలను మూలాధికారముల
ప్రచారించు నిమిత్తము ప్రసారము చేయుటకు అధి
కారముకూడ వాటికి కలదు. జిల్లా న్యాయస్థాన
ములపై వాటి కధీనములై యున్న యితర న్యాయ
స్థానములవంటి యధీన న్యాయాలయముల ఆఫీసులపై
అధీక్షణ చేయుటకును వాటికి శక్తి కలదు.

217 — (బి) విభాగములో చెప్పబడి యున్నట్లు
ఉచ్చ న్యాయస్థానముల న్యాయాధీశులయొక్క స్వాతం
త్ర్యము విధి (లా) చేత సంరక్షింపబడుచున్నది. ఆ
విధి ఆజ్ఞ రాష్ట్రపతియొక్క ఉత్తరువు వలననే ఉచ్చ
న్యాయాలయమందలి న్యాయమూర్తిని పదవినుండి

తొలగించుటకు వీలగునట్లు ఏర్పాటు చేసియున్నది. ఈ యాజ్ఞ పార్లమెంటులోని ప్రతి ఒక సభయందును ఒకే సమావేశములో దుష్ప్రవర్తన, లేదా అసమర్థత అను కారణములపై అట్లు పదవినుండి తొలగింపుకొరకు సంబోధనను (ఎడ్రెస్) రాష్ట్రపతికి నివేదించిన అనంతరమే ప్రసాదింపబడును. ఈ సంబోధన పరముగా ప్రతి సభయందలి మొత్తము సదస్యులలో అధిక సంఖ్యాకులు ఓటు వేయవలెను; అంతేకాక, ఆ సభయందలి సదస్యులలో హాజరై, ఓటు వేసినవారిలో మూడింట రెండువంతులకు తక్కువకాని అధిక సంఖ్యతో ఆ సంబోధన పారితము కావలెను. ఈ ప్రతి రక్షణ (సేఫ్‌గార్డు) కు అధీనమై ఉచ్చ న్యాయాలయపు న్యాయమూర్తి తనకు 60 సంవత్సరముల వయస్సు పూర్తియగువరకు ఆ పదవిలో నుండవలెను. అయితే, ఆయనను ఒక న్యాయస్థానమునుండి యింకొక దానికి బదిలీ చేయవచ్చును. ఆయన వేతనమును ఆయనకు ప్రతికూలముగా మార్చరాదు. ఆయన ఉద్యోగధర్మములో ఏమి చెప్పినను, చేసినను ఆయనపై చర్యలను తీసికొనుటకు వీలులేదు.

వ్యక్తిగతముగా పౌరులమీదను, ఉద్యోగరీత్యా తీసుకొనిన చర్యలకై ఉద్యోగులమీదను న్యాయపాలక వర్గమునకు క్షేత్రాధికారము కలదు. కనుక నే

న్యాయపాలక వర్గము విధురీత్యా పరిపాలన (రూల్ ఆఫ్ లా) సిద్ధించుటకు తోడ్పడుచున్నది ఈ విధి నియమము పౌరునియొక్క అధికారములకు స్వేచ్ఛలకు నిశ్చయమై, బలమైనట్టి రక్షణ. మన న్యాయపాలకవర్గము నెలాయించుచున్న స్వాతంత్ర్యముకూడ విధానసభ నియమములకు బాసటయై యున్నది. దేశము లోని ఏ విధానసభయందలి దైనను పారితమైన చేసిన చట్టము దేశముయొక్క మూలాధార చట్టమగు సంవిధాన చట్టమునకు అనుకూలముగా నున్నదో లేదో నిశ్చయించుటకు అధికారము, శక్తియు ఉచ్చతమ న్యాయస్థానమున కీయబడినవి. ఈ విషయమును ముందు మనము విశదముగా తెలిసికొందము. ఈ పద్ధముగా న్యాయపాలక వర్గము పౌరుని స్వేచ్ఛలను రక్షించు నట్టి దుర్గము వంటిది.

## కేంద్రప్రభుత్వము - రాష్ట్రపతి

### (ప్రెసిడెంటు)

ఇండియాలో రాజ్యాధిపతికి ఇండియా రాష్ట్రపతి అని పేరు. 53-1 వ విభాగ ప్రకారము ఇండియా ప్రభుత్వముయొక్క కార్యపాలకశక్తి ఆయనయందు నిహితమై యున్నది. ఆ శక్తిని ఆయనే స్వయముగా గాని, లేక అధీనులగు ఉద్యోగులద్వారా కాని వినియో

గించవచ్చును. దేశముయొక్క గణతంత్ర బలమునపై సర్వోచ్చ (సుప్రీమ్) నాయకత్వము ఉండునట్లుండే నిహితమై యున్నది.

ఒక నిర్వాచక గణ మండలి (ఎలక్టోరల్ కాలేజి) సదస్యులచే రాష్ట్రపతి ఎన్నుకొనబడవలెను. ఈ గణమునందు కేంద్ర విధాన మండలి రెండు సదనముల యందలి ఎన్నుకోబడిన సదస్యులును, రాజ్యముల విధానసభల యందలి ఎన్నుకోబడిన సదస్యులును కూడియుందురు. రాజ్యములు విస్తీర్ణమందును, జనాభాలోను భేదించి యున్నవి. అందుచేత, ఆచరణ సాధ్యమైనంత వరకు రాష్ట్రపతి ఎన్నికలో వివిధ రాజ్యములకు ప్రాతినిధ్య పరిమాణమునందు సమరూపత ఉండుటకై ఏర్పాటు చేయబడినది. రాష్ట్రపతి ఎన్నికలో అల్ప సంఖ్యాకులకు కూడ స్థానముండుటకై, ఆయన ఎన్నిక అనుపాతి ప్రాతినిధ్య పద్ధతిని (ప్రొపోర్షనల్ రిప్రజెంటేషన్) జరుగవలెను. పైగా ఏకైక సంక్రమణీయ ఓటు (సింగిల్ ట్రాన్స్ఫరబుల్ ఓట్) పద్ధతిని జరుగవలెను. అనగా, ఓటరు ఎన్నికకై నిలువబడియున్న అభ్యర్థులయెడ తన అభిమత క్రమ మెట్లున్నదో సూచించును; ఎన్నికల ఉద్యోగస్థులు చేసిన లెక్కల పరంపరలో ఎక్కువ అభిమతమును (ప్రిఫరెన్సు) సంపాదించుకొన్న అభ్యర్థి గెలుపొందనట్లు తీర్మానమగును.

రాష్ట్రపతి పదవియొక్క అవధి ౫ సంవత్సరములు. అది మరణముచేతగాని, రాజీనామాచేతగాని, కేంద్ర విధానమండలి ఓటు ఫలితముగా తొలగింపుచేత గాని రద్దు కావచ్చును. ఈ పదవికి కావలసిన అర్హతలేవనగా: ఆయన ఇండియా పౌరుడై యుండవలెను; ౩౫ ఏండ్లు వయస్సు కలిగి యుండవలెను; లోకసభకు ఎన్నుకొనబడుటకై అర్హత కలిగి యుండవలెను.

విధానమండలి ఏ యొక సదనములోను ఆయన సదస్యుడు కాకపోయినను, ఆయన విధానమండలిలో నొక అంతర్భాగమే. ఎందుకనగా, కేంద్ర విధాన మండలి పారితము చేసిన విధులన్నియును, రాజ్య విధాన మండలిచే పారితము చేయబడి, వాటి ప్రాముఖ్యము వలననో, వివాదాంశములగుట చేతనో రాజ్య పాలకునిచే కేటాయింపు చేయబడిన కొన్ని విధులును, మాన్యత (వెలిడిట్) కొరకు, ప్రకటన కొరకు రాష్ట్రపతియొక్క సమ్మతిని బడయవలసి యున్నవి.

రాష్ట్రపతికి, ఏ అపరాధమునైనను చేసినట్లు దోషస్థాపన చేయబడిన ఏ వ్యక్తియొక్క దండన విషయములోనైనను క్షమాపణ, లేక విలంబన (రెస్పైట్), లేక దండన పరిహారము చేయుటకు, దండాదేశమును తగ్గించుటకు శక్తికలదు. కార్యపాలక వర్గమునకు అధిపతి కావున, కేంద్రప్రభుత్వముయొక్క సర్వోచ్చ

కార్యపాలకవర్గ విరచనలో ఆయనకు జోక్యమున్నది. కాని, ప్రధానమంత్రిని నియమించు అధికారము ఆయన కున్నను, లోకసభలో అధిక సంఖ్యాకులకు నాయకుడైన వ్యక్తినే ఆయన గ్రహింపవలసి యున్నది. బాధ్యతాయుత ప్రభుత్వ విధానముక్రింద ఆయన ప్రతి విషయములోను మంత్రిపరిషత్తొసంగిన సలహాను అనుసరించవలెను. మంత్రులతో ఆయనకు అభిప్రాయభేదము సంభవించిన యెడల ఆయన రాజీనామా నియ్యవలసి యుండును. పరస్పర మర్యాదలకు వర్తించెడు ఆయన కృత్యములన్నియు నెంతయో ముఖ్యమైనవి. ఇంగ్లాండులోని రాజు లేక రాణివలెనే ఆయన రాష్ట్రమునకంతకు ప్రతినిధి; ప్రజలయొక్క సాంఘిక జీవనమునకు అధిపతిగాను, నాయకుడుగాను ఆయన నడచుకొనును.

ఉపరాష్ట్రపతిని పార్లమెంటు రెండు సదనముల సభ్యులును ఒకేసభలో సమావేశమై ఎన్నుకొందురు. ఈ ఎన్నిక అనుపాతి ప్రాతినిధ్య పద్ధతిచేతను, ఏకైక సంక్రమణ ఓటు విధాన ప్రకారముగాను జరుగును. మరణముచేతగాని, రాజీనామా వలనగాని, రాష్ట్రపతి స్థానములో ఖాళీ యేర్పడినట్లయితే రాష్ట్రపతి తరపున తరువాతి రాష్ట్రపతిని ఎన్నుకొను పర్యంతము ఈయన పనిచేయును. అటువంటి సమయములందు

రాష్ట్రపతి యుండెడి శక్తులను, విశేషాధికారములను ఈయన చెలాయించును. సాధారణముగా రాజ్యసభ కీయన సభాపతి ఉద్యోగమును స్వీకరించిన తేదీ మొదలు ఈయన పదవి అవధి 5 సంవత్సరములు.

## మంత్రి పరిషత్తు

74 వ విభాగ ప్రకారము, ఇండియా సమాఖ్య (యూనియన్) ప్రభుత్వముయొక్క కార్యపాలక శక్తి ని ఆచరణలో పెట్టుటకై రాష్ట్రపతికి సహాయ పడుటకు సలహానిచ్చుటకు ఒక మంత్రి పరిషత్తుండ వలెను. దానికి ప్రధానమంత్రి ముఖ్యుడు. ఈ ప్రధాన మంత్రిని రాష్ట్రపతి నియోగించును; ప్రధాని సలహా నందుకొని, రాష్ట్రపతి ఇతర మంత్రులను నియోగిం చును. రాష్ట్రపతి అనుగ్రహ పర్యంతము ఈమంత్రులు పదవిలో నుందురు. అయితే, ఈ అనుగ్రహము పార్ల మెంటులో మంత్రిపరిషత్తుకుగల బలమునకు ప్రతికూల ముగా నుండరాదు. ఎందుకనగా, మంత్రిపరిషత్తం తయు సమష్టిగా లోకసభకు బాధ్యత వహించియున్నది. బాధ్యతాయుత ప్రభుత్వమునకు చెందిన సూత్రము లను, అభిసమయములను (కన్వెన్షన్సు) పాటించియే కేంద్రమందలి మంత్రిపరిషత్తుకూడ పనిచేయును.

## ఇండియా మహాన్యాయవాది
### ( ఇండియా ఎటోర్నీ జనరల్ )

విధి (లా) కి సంబంధించిన విషయములలో ఇండియా ప్రభుత్వమునకు సలహానిచ్చునట్టి పదాధికారుడైన న్యాయవాది ఈయన. పైగా, అప్పటికప్పుడు రాష్ట్రపతిచేత తనకు నిర్దేశింపబడినట్టి (రిఫర్డు లేక అప్పగింప బడినట్టి విధి (లా) స్వభావముగల ఇతర కర్తవ్యములను ఈయన నిర్వహించవలెను; ఇంకను ఈ సంవిధానము చేతగాని, తత్కాలమున అమలునందుండు మరి ఏయితర విధిచేతగాని తనకు నియమింపబడునట్టి కృత్యములను నిర్వహింపవలెను. ఇండియా ప్రభుత్వము వాదిగాగాని, ప్రతివాదిగాగాని ఏదావాలో పాల్గొన్నను న్యాయస్థానములలో దాని ప్రతినిధిగా దాని తరఫున ఆయన వాదించవలెను.

ఆయనకు ఇండియా మహాధివక్త (అడ్వొకేటు జనరల్) అనిపేరు. ఆయన రాష్ట్రపతిచే నియుక్తుడై, రాష్ట్రపతి అనుగ్రహ పర్యంతము తన పదవిలో నుండవలెను; రాష్ట్రపతి నిశ్చయించునట్టి ప్రతిఫలమును పొందవలెను.

## కేంద్ర లేక జాతీయ విధాన మండలి

79 వ విభాగము పార్లమెంటు అనుపేరిట ఇండియా జాతీయ విధానమండలిని ఏర్పాటు కావించి

యున్నది. దీనిలో రాష్ట్రపతియును, లోకసభ అనియు, రాజ్యసభ అనియు పేరులుగల రెండు సదనములు నున్నవి.

## లోకసభ

ఇది ఇండియాప్రజల ప్రతినిధి. 81 విభాగ ప్రకారము దీనిలో 500 మంది సదస్యులుందురు. వివిధ రాజ్యములలో అర్హులై, నిర్దిష్టులైన (రిజిస్టరు) ఓటర్లు వీరిని ప్రత్యక్షముగా ఎన్నుకొందురు. లోకసభకు ఎన్నిక నిమిత్తమై ప్రతిరాజ్యమును విభజించి, కొన్ని క్షేత్రీయ నియోజక వర్గములుగా కూర్చియున్నారు. జనాభా లోని ప్రతి 500,000 మందికి ఒక సదస్యుడుండునట్లుగా యీ నియోజక వర్గములకు సదస్యుల మొత్తపుసంఖ్య పంచి యిచ్చుటయైనది.

అంతకు ముందుగానే రాష్ట్రపతిచేత విఘటన (డిసొల్యూషన్) చేయబడిననేగాని, లోకసభ దాని ప్రథమసమాగమ తేది మొదలు 5 ఏండ్లవరకు ఉండవలెను; అంతకుమించి యుండరాదు; ఈ 5 ఏండ్లఅవధి పూర్తియగుటతోడనే అది విఘటన కావలెను.

ప్రజలకుగాక రాజ్యములకే రాజ్యసభ ప్రాతినిధ్యమిచ్చుచున్నది. 80 వ విభాగప్రకారము దానిలో

(1) సాహిత్య, శాస్త్రీయ, కళా, సాంఘిక సేవల విషయములలో విశేష జ్ఞానమును, అనుభవమును

కలిగియున్నందులకు గాను రాష్ట్రపతిచే నామనిర్దేశము చేయబడిన సదస్యులు 12 గురును;

(2) రెండు వందల ముప్పదిమొనిమిది నుండికి మించకుండు రాజ్యముల ప్రతినిధులును దానిలో చేరి యుందురు. ఎన్నుకొనబడిన విధానమండలులు గల రాజ్యముల ప్రతినిధులు, ఆ రాజ్యములయొక్క విధాన సభలకు ఎన్నికయిన సదస్యులచే ఎన్నుకోబడుదురు. ఎన్నిక అనుపాతీ ప్రాతినిధ్య పద్ధతి ననుసరించియు, ఏకైక సంక్రమణీయ ఓటు విధానము ననుసరించియు జరుగును. అట్టి విధానమండలులు లేని రాజ్యముల ప్రతినిధులు పార్లమెంటు నిర్ధారణచేయు రీతిని ఎన్నుకో బడవలెను

## పార్లమెంటు సదస్యుల అర్హతలు

పార్లమెంటులో సభ్యత్వమునకు కావలసిన అర్హతలు: అభ్యర్థి ఇండియా పౌరుడై యుండవలెను. రాజ్యసభలో స్థానమునకై 30 సంవత్సరముల వయస్సు ఉండవలెను; లోకసభలో స్థానమునకై 25 సంవత్సరము లుండవలెను. 84 వ విభాగ ప్రకారము పార్లమెంటు మరికొన్ని అర్హతలను అదనముగా నిర్ణయించ వచ్చును. కాని అటువంటి అదనపు అర్హత లెవ్వియును ఇంతవరకు నిర్ణయము కాలేదు. కాని పార్లమెంటులో యోగ్యులు, సమర్థులు నగు సదస్యులుగ నుందురని

నమ్మకమున్నవారినే పార్లమెంటు ఎన్నికలకై అభ్యర్థులుగా రాజకీయ పక్షములవారు నామ నిర్దేశము చేయుట సమంజసము.

## పార్లమెంటు సభ్యత్వమునకు అనర్హతలు

(1) ప్రభుత్వము క్రింద లాభదాయకమగు ఉద్యోగమున నుండుట;

(2) చిత్తవికృతి పొందినట్లు న్యాయస్థానముచే ప్రకటించబడుట;

(3) విడుదల చేయబడని దివాలాదారుడై యుండుట;

(4) ఇండియా పౌరుడు కాకయుండుట; లేక ఒక విదేశరాజ్యముయొక్క పౌరత్వమును బుద్ధిపూర్వకముగ స్వీకరించి యుండుట

అనునవియే అనర్హతలు.

## పార్లమెంటు అవధి, సమావేశములు

85 వ విభాగ ప్రకారము పార్లమెంటుయొక్క సదనములు ప్రతిసంవత్సరమునను కనీసము రెండు సారులైనను సమావేశమగుటకు ఆహ్వానింప బడవలెను. రెండు సమావేశములమధ్య ఆరుమాసములకు మించి వ్యవధియుండరాదు. అయితే, రాష్ట్రపతి, ఆయనకు

యు క్త్రమని తోచినపుడెల్ల పార్లమెంటును, లేక సదన ములలో దేనినైనను ఆహ్వానించవచ్చును.

లోకసభ, సాధారణ ఎన్నికల అనంతరము ప్రథమ సమావేశమైన తేదీ మొదలు 5 సంవత్సర ములవరకు ఉండును. అయినను, మంత్రిపరిషత్తు యొక్క సలహాపైన దానిని రాష్ట్రపతి విఘటన చేయ వచ్చును.

రాజ్యసభను మాత్రము విఘటన చేయరాదు; కాని దరిదాపుగా దానిలో మూడవవంతు సదస్యులు ఈ విషయమున పార్లమెంటు చేసిన ఏర్పాటు ప్రకా రము ప్రతిరెండవ సంవత్సరము సమాప్తియైన పిమ్మట వీలైనంత త్వరలో నివృత్తి (రిటైరు) యగుదురు.

## కేంద్ర విధానమండలి శక్తులు

పార్లమెంటు ప్రతి సదనముయొక్క, ప్రతి సద నపు సదస్యుల, సమితుల (కమిటీ) యొక్క శక్తులు, విశేషాధికారములును, పార్లమెంటు విధిద్వారా అప్పటి కపుడు నిర్వచించిన ప్రకారము ఉండును: అట్లు నిర్వ చింపబడునంతవరకు అవి ఇంగ్లీషు కామన్సు సదనము నకు చెందిన వాటివలె నుండును. వీటిలో ప్రధాన మైనవి యివి :—

(ఎ) సంవిధానము కేంద్రప్రభుత్వమునకు అప్ప గించిన అంశములపై ఇండియా రాజ్యక్షేత్రమున కంతకు వర్తించునట్లు విధుల నిర్మించుటకు శక్తి;

(బి) ప్రభుత్వమునకు విధానములను, చర్యలను సిఫారసు చేయుచు తీర్మానముల ప్రతిపాదన. అయితే, ఆ సిఫారసులను ప్రభుత్వము అనుసరింపవలెనని నిర్బం ధము లేదు.

(సి) ధనమును వసూలు చేయుటకును, పరి పాలనయందలి వివిధశాఖలపైనను, అవి ప్రజలకు జేయు సేవల నిమిత్తము ఖర్చు చేయుటకును మంజూరు చేయుట;

పన్నులు విధించుటకు, వ్యయము చేయుటకును ప్రతిపాదనలు ప్రభుత్వమునుండియే బయలుదేర వలెను; విధానమండలి మొత్తముగాగాని, దానియందలి వ్యక్తిగతముగ సదస్యుడుగాని వాటిని ఉపక్రమించ రాదు. వార్షికములగు పన్నులు, వ్యయము విధాన మండలి ఓటుద్వారా ప్రతి సంవత్సరము మంజూరు కావలెను.

ఈ క్రింద నుదహరింపబడిన ఖర్చు పద్దులను మాత్రము ప్రతి సంవత్సరము ఓటుద్వారా మంజూరు చేయనక్కరలేదు; ఇవి శాశ్వతమై, ఓటుతో నిమి

త్తములేని పద్దులు. రాజ్యముయొక్క సంచిత నిధి (కన్సాలిడేటెడ్ ఫండు) అనగా రాజ్యముయొక్క రెవిన్యూకు సంబంధించిన నిధి ఈవ్యయములను భరించ వలెను;

(1) రాష్ట్రపతియొక్క ఉపలబ్ధులు (ఇమాల్యుమెంట్సు) బత్తాలు, ఆయన పదవికి సంబంధించిన యితర వ్యయములు:

(౨) రాజ్యపరిషత్తుయొక్క సభాపతి, ఉపసభాపతులయొక్కయు, లోక సభయొక్క అధ్యక్షు, ఉపాధ్యక్షులయొక్కయు వేతనములు, బత్తాలు:

(౩) ఇండియా ప్రభుత్వము బాధ్యతవహించు విమోచన (డెబిట్) భారములు; పైగా, వాటికగుసట్టి వడ్డీ, నిక్షేపనిధి భారములు వగైరాలు:

(4) ఉచ్చన్యాయాలయపు న్యాయాధీశుల వేతనములు, బత్తాలు, నివృత్తి వేతనములు (పెన్షనులు);

(౫) రాజ్యములయందలి ఉచ్చన్యాయాలయముల న్యాయమూర్తుల నివృత్తి వేతనములు;

(6) ఇండియా నియంత్రక మహాలేఖా పరీక్షకునకు (కంట్రోలరు-ఆడిటరు జనరల్) చెల్లించవలసిన వేతనములు, బత్తాలు;

(7) న్యాయస్థానముల తీర్పులను తృప్తి పరచుటకు కావలసిన మొత్తములు:

(8) సంవిధానము లేక పార్లమెంటు, సంచిత నిధినుండి చెల్లించవలసిన భారములని ప్రకటించిన ఇతర భారములన్నియును;

రాజ్యముయొక్క ఆదాయవ్యయ జాబితా (బడ్జెట్టు) విషయములోవలెనే, పార్లమెంటుయొక్క సాంవత్సరిక ఓటునుండి ఈ మినహాయింపు న్యాయసమ్మతమే. ఎందుకనగా, యీ వ్యయములు శాశ్వతమైనవి, తప్పనిసరి యైనవి; అందుకుగాను వాటిని చంచలమగునట్టి విధానమండలి సాంవత్సరిక ఓటునకు అధీనము చేయరాదు.

(డి) ఇంకను, కేంద్ర విధానమండలి ప్రభుత్వముయొక్క దేశపరిపాలన పైనను, విధానమండలి ప్రతిసదనములో ప్రశ్నలకాలమున తనిఖీద్వారా ఒక్కొక పరిపాలన చర్యపైనకూడ అదుపు ఆజ్ఞలను కలిగియున్నది;

(ఇ) మంత్రి పరిషత్తుయొక్క సాధారణ విధానము, పరిపాలనయు లోకసభకు అంగీకారముగానున్న యెడల చర్చించబడు విషయములపై అనుకూలమగు ఓటుచే బలపరచి, మంత్రిపరిషత్తును పదవిలో నుంచును. లేదా, విధానమునకు, పరిపాలనకు చెందిన

పెద్ద విషయములలో ప్రతికూలమగు ఓటువేసి ఆ బలమును ఉపసంహరించి దానిని పదవినుండి తొలగించును;

(ఎఫ్) రాజ్యవిధానమండలికి వలెనే కేంద్రవిధానమండలిలోని ప్రతిసదనమునకు దాని క్రియాకలాపమును దాని వ్యవహారములలో కార్యక్రమమును దాని స్వంత స్థాయీ ఆదేశముల చేతను, తీర్మానముల చేతను శాసించుకొనుటకు అధికారము కలదు.

## రాష్ట్రపతియొక్క అసాధారణ విధినిర్మాణ శక్తి

కేంద్రప్రభుత్వములో సాధారణముగా విధుల నిర్మించు నికాయము (body) పార్లమెంటు. అయినను సంవిధానమందలి 123 వ విభాగప్రకారము రాష్ట్రపతికి చట్టనిర్మాణ విషయమై అసాధారణశక్తి ఇవ్వబడినది. పార్లమెంటు రెండు సదనములు సమావేశమైయున్నప్పుడుగాక, ఏయితర సమయమందైన, రాష్ట్రపతి, తను సత్వరము తగుచర్య తీసికొనవలసిన అగత్యమును కల్పించిన పరిస్థితు లేర్పడినవని నమ్మినయెడల, అపుడే యీశక్తుల నుపయోగించును. అపుడు ఆయన అధ్యాదేశములను ప్రకటించవచ్చును. వీటికి పార్లమెంటుచేసిన విధులకున్న బలమంతయు కలదు. కాని

అట్టి ప్రతి ఒక అధ్యాదేశమును పార్లమెంటు రెండు సదనముల సమ్ముఖమునకు తేవలసియున్నది; పార్లమెంటు సమావేశమైన పిమ్మట 6 వారములు గడచిన వెనుక అదివర్తించక నిలిచిపోవును; లేదా, ఆ వ్యవధి గడవక పూర్వమే దానికి అసమ్మతి తెలియచేయును రెండు సదనములు తీర్మానములు చేసియున్న యెడల అది లుప్తమైపోవును.

## కేంద్ర న్యాయపాలక వర్గము

### ఉచ్చతమ న్యాయస్థానము (సుప్రీంకోర్టు)

దేశమందలి న్యాయపాలక వ్యవస్థయొక్క శిఖరాగ్రమందు ఉచ్చతమ న్యాయస్థానమున్నది. రాజ్యములందలి ఉచ్చన్యాయస్థానములకు వలెనే, ఉచ్చతమ న్యాయాలయముకూడ 129 వ విభాగ ప్రకారము అభిలేఖ న్యాయాలయముగ నున్నది. అనగా, అట్టి న్యాయస్థానముల చర్యలు రికార్డు చేయబడి, సాక్ష్యముగా నుదహరింపబడును; వాటికి విధిని అతిక్రమించిన వ్యక్తులను విచారణచేసి, దండించుటకు అధికారమున్నది. ఉచ్చతమ న్యాయాలయము అట్టి న్యాయస్థానముల శక్తినంతయును, తమను అవమానపరచిన[1] వారిని దండించు శక్తితోసహా కలిగిఉన్నది.

దానికి ప్రారంభిక క్షేత్రాధికార మున్నది. అనగా, అట్టి న్యాయస్థానమునకు దావాలను మొట్ట మొదటిసారి కొనిపోవచ్చును. కేంద్ర ప్రభుత్వమునకు, రాజ్యములకు మధ్య సంభవించిన వివాదములలోను, లేక కేంద్రప్రభుత్వము కొన్ని రాజ్యము లొకవైపున, మరికొన్ని రాజ్యము లొకవైపున నుండగా కల్గిన వివాదములలోను, కేవలము రాజ్యములమధ్య బయలు దేరిన వివాదములలోను, ఏ విధి లేదా యథార్థము పైన ఒక విధిసంబంధమైన హక్కును అమలు జరుపుట ఆధారపడి యున్నదో అట్టి ప్రశ్నలు ఇమిడియున్న వివాదములలోను, ఉచ్చతమ న్యాయాలయమునకు ప్రారంభిక క్షేత్రాధికారము కలదు. పూర్వము బ్రిటిషు ఇండియా ప్రభుత్వమునకు పూర్వపు ఇండియా సంస్థానములకును మధ్య అమలునందు సాగుచున్న సంధుల, ఒప్పందముల, సనదుల లేక అట్టి యితర ఒడంబడికల యందలి షరతుల నుల్లంఘించినదని ఇండియా ప్రభుత్వముపై నేరారోపణ చేయుటలో ఇండియా ప్రభుత్వమునకు, రాజ్యములకు మధ్యగాని, కేవలము రాజ్యముల మధ్యగాని ఉత్పన్నమైన వివాదములు ఉచ్చతమ న్యాయాలయముయొక్క క్షేత్రాధికారమునుండి మినహాయించబడినవి. వీటిని రాష్ట్రపు చర్యలుగా పరిగణించుటయు, అందుచేత అవి న్యాయస్థానముల

క్షేత్రాధికారములకు వెలుపల నున్నవని ఎంచుటయును, దీనికి కారణము.

ఉచ్చతమ న్యాయాలయము అప్పీలు న్యాయస్థానము కూడ. ఏ రాజ్య మందలి ఉచ్చన్యాయస్థానపు తీర్పు, డిక్రీ లేక అంత్యాదేశమునుండి యైనను ఈ అప్పీళ్ళు రావచ్చును; సివిలుగాని, క్రిమినలుగాని మరి ఏ యితర కేసులనుండి గాని అవి ఉత్పన్నము కావచ్చును. సంవిధానమును అన్వయించుటకు సంబంధించిన ప్రబలమైన ప్రశ్న ఇమిడియున్నదని ఉచ్చన్యాయస్థానము ప్రమాణీకరించిన (సర్టిఫైస్) యెడల ఉచ్చతమ న్యాయాలయమునకు అప్పీలు ఉండవలెను. ఉచ్చన్యాయాలయము అట్టి ప్రమాణ పత్రము నిచ్చుటకు నిరాకరించిన యెడల, ఈ సంవిధానముయొక్క అన్వయమును గురించి విధికి సంబంధించిన ప్రబలమైన ప్రశ్న యిమిడియున్నదని ఉచ్చతమ న్యాయాలయము తృప్తిపడిన యెడల అది అట్టి అప్పీలు చేసుకొనుటకు అనుమతి నివ్వవచ్చును.

సివిలు కేసులలో రూ. 20,000 లకు తక్కువ కాకుండ సొమ్ము యిమిడియున్న యెడల ఉచ్చతమ న్యాయస్థానమునకు అప్పీలు చేసుకొనవచ్చును; క్రిమినలు కేసులలో దానియొక్క అప్పీలు క్షేత్రాధికారము ఈ క్రింది సందర్భములలో ఉండగలదు. (1) ఉచ్చ

న్యాయస్థానము, అప్పీలుమీాద, దోషారోపణ చేయ బడిన ముద్దాయిని విముక్తునిచేయు ఆదేశమును మార్చి అతనిపై మరణదండన విధించిన యెడల; (2) తన ప్రాధికారమునకు అధీనమైయుండు ఎట్టి న్యాయస్థానము నుండియైనను కేసును తామే విచారణ చేయుటకై తీసికొని అట్టి విచారణలో ముద్దాయిగానున్న వ్యక్తిపై దోషస్థాపన చేసి అతనిపై మరణదండన విధించిన యెడలను; (3) లేదా అట్టి కేసు ఉచ్చతమ న్యాయ స్థానమునకు అప్పీలు చేయుటకు తగియున్నదని ప్రమాణీ కరణము చేసియున్న యెడల — ఉచ్చతమ న్యాయా లయమునకు అప్పీలుండవలెను. ఇవి అన్నియు అటుంచి, ఇండియాలోని ఒక న్యాయస్థానము లేక న్యాయాధి కరణము (ట్రిబ్యునల్) ఏ కేసులోనైనను పారితము చేసిన తీర్పు, డిక్రీ, దండాదేశము లేక అంత్యాదేశము పైన అప్పీలు చేసికొనుటకు ఉచ్చతమ న్యాయాలయము స్వబుద్ధికితోచి ప్రత్యేకముగా అనుజ్ఞ నీయవచ్చును. తానే చేసిన ఆదేశమునుగాని, చెప్పిన తీర్పునుగాని పునర్విలోకనము చేయుటకు దానికి శక్తియున్నది.

అదియునుగాక, పౌరునియొక్క మూలాధికార ములను రక్షించునట్టి ప్రయోజనముకంటె అన్యమైన కేసులలో బందీ ప్రత్యక్ష, పరమాదేశ, ప్రతిషేధ, అధికారపృచ్ఛ, ఉత్ప్రేషణ లేఖలను ప్రసరింప చేయు

టకు పార్లమెంటు ఉచ్చతమ న్యాయస్థానమునకు ప్రత్యేకాధికారము కలుగచేయవచ్చును. దీని పై నింకను దాని క్షేత్రాధికారమును శక్తిని పార్లమెంటు విస్తరింప చేయవచ్చును.

సంవిధానములో 141-142 విభాగములలో ఉచ్చతమ న్యాయాలయముచేత ప్రకటింపబడిన విధికి ఇండియాలోని న్యాయస్థానము లన్నియు బద్ధమైయుండ వలెను; దాని తీర్పులు, డిక్రీలు, ఆదేశములు ఇండియా రాజ్యక్షేత్రమునం దెల్లెడల ప్రవర్తింపచేయ బడ వలెను. ఏవ్యక్తిగాని హాజరగునట్లు చేయుటకును, ఎట్టి దస్తావేజులనైనను ప్రకటన చేయుటకు, వాటిని హాజరు చేయుటకును, తనకు జరిగిన అవమానమును (Contempt of Court) పరిశోధన చేయుటకు, దానికై దండించు టకు ఉచ్చతమ న్యాయాలయము సర్వశక్తిని కలిగి యున్నది.

## ఉచ్చతమ న్యాయాలయపు అసాధారణ చర్య

ఉచ్చతమ న్యాయాలయముతో సమాలోచన చేయుటకు రాష్ట్రపతికి అధికారమీయ బడినది. ఆ న్యాయాలయముయొక్క అభిప్రాయమును తెలుసు కొనుటకు అవసరమైన స్వభావమును, సార్వజనిక ప్రాముఖ్యమునుగల విధి లేక యథార్థము[1] సంబంధ

[1] Law or fact.

మైన ప్రశ్న ఉత్పన్నమైనదని లేదా, ఉత్పన్నము కావచ్చునని రాష్ట్రపతికి తోచినపుడే ఆయన యిట్లు సమాలోచన చేయును. అయితే, అట్టి సమాలోచన మూలమున ఉచ్చతమ న్యాయాలయము యొక్క స్వాతంత్ర్యమునకు, నిష్పాక్షిక ప్రవర్తనకు భంగము వాటిల్లవచ్చును; ఎందుకనగా, అటువంటి విధి లేక యథార్థము సంబంధమైన ప్రశ్నలు యిమిడియున్న కేసులు వాస్తవముగా తీర్పుకొఱకై యీ న్యాయాలయ సమ్ముఖమునకు తేబడినపుడు అదివరలో ఇచ్చియున్న తమ యభిప్రాయములను తామే పునర్వ్యాలోకన చేయవలసియుండును. అందుచేతనే సంవిధానము రాష్ట్రపతి సమాలోచన కావించియున్న కేసులలో ఉచ్చతమ న్యాయాలయము తమ యభిప్రాయమును రాష్ట్రపతికి నివేదించ "వచ్చును" ("వలెను" అనలేదు) అని స్పష్టపరచి జాగ్రతపడినది. పూర్వపు బ్రిటిషు ప్రభుత్వమునకు పూర్వపు ఇండియా సంస్థానములకు మధ్య జరిగిన సంధుల, ఒప్పందములలోని వస్తువిషయమువంటి, విచారణచేసి తీర్పుచెప్పుటకై ఉచ్చతమ న్యాయాలయమునకు తీసికొని రాకూడదని—కేసుల, సందర్భములలో మాత్రము ఈ న్యాయాలయము తమ అభిప్రాయమును రాష్ట్రపతికి నివేదించ "ఏలసి" యున్నది.

కార్యపాలిక శక్తినుండి దాని స్వాతంత్ర్యమును కాపాడవలెను. ఉచ్చతమ నను హామీకొఱకు న్యాయాలయ, న్యాయాధీశుల వేతనములు, బత్తాలును దాని ఆఫీసును నిర్వహించుట కగునట్టి ఖర్చులును వార్షిక బడ్జెట్టులో విధానమండలి ఓటు వేయవలసిన కార్యకలాపమున చేరకుండ ఉంచబడినవి; వాటి భారమును సూటిగా సంచిత నిధిపైననే వేసియున్నారు.

ఒక ప్రధాన న్యాయాధీశుడును, కొందరు కనిష్ఠ న్యాయాధిపతులును కూడి ఉచ్చతమ న్యాయాలయము ఏర్పడుచున్నది. పార్లమెంటు వేరు విధముగా నిర్ణయము చేసియున్ననేగాని, వారి సంఖ్య 7 మించియుండరాదు. ఉచ్చతమ న్యాయాలయము యొక్క ప్రతి న్యాయాధిపతియు, అవిమయుమై ప్రధాన న్యాయాధీశునితో సంప్రతించిన తరువాత — రాష్ట్రపతిచేత నియోగింప బడును. అవసరమని రాష్ట్రపతికి తోచిన ఉచ్చతమన్యాయాలయపు ఇతర న్యాయమూర్తులతోను రాజ్యములందలి ఉచ్చన్యాయ స్థానముల ప్రధానన్యాయమూర్తులతోనుకూడ సంప్రతింప వచ్చును. 65 సంవత్సరముల వయస్సు వచ్చునంతవరకు వారు పదవిలోనుందురు.

ఉచ్చతమ న్యాయాలయములో న్యాయమూర్తిగా నియుక్తుడగుటకు ఒక వ్యక్తి ఇండియా పౌరుడై

యుండవలెను; కనీసము 5 సంవత్సరములు ఒక ఉచ్చ న్యాయస్థానపు న్యాయమూర్తియై యుండవలెను; లేక వరుసగా రెండు మూడు న్యాయస్థానముల న్యాయమూర్తియై యుండవలెను; లేక కనీసము 10 సంవత్సరములు ఉచ్చన్యాయాలయములో కాని, లేక అటువంటి ఇతర న్యాయస్థానములలో వరుసగాగాని న్యాయవాదియైయుండవలెను; లేక రాష్ట్రపతి అభిప్రాయములో ఖ్యాతి వడసిన న్యాయశాస్త్రజ్ఞుడై యుండవలెను.

విధానమండలియొక్క ఓటుకు లోబడకుండ వారి వేతనములను, ఉపలబ్ధులను వేరుచేయుటయే కాక, ఇంకను న్యాయాధీశునియొక్క స్వాతంత్ర్యమును నిశ్చయ పరచుటకు సంవిధానము ప్రత్యేకపు ఏర్పాటు ఒకటి చేసియున్నది. నిశ్చితమైన దుర్ప్రవర్తన, అసమర్థత అను కారణములను పురస్కరించుకొని ఒక న్యాయమూర్తిని పదవినుండి తొలగించుటకై పార్లమెంటులోని ప్రతిఒక సదనము ఒకేఒక సమావేశములో (Session) సంబోధన చేసి, దానిని ఆ సదనమునందలి సదస్యులలో అధిక సంఖ్యచేతను, ఆ సదనపు సదస్యులలో హాజరై, ఓటు చేయువారిలో అధికసంఖ్య చేతను, ఓటువేసి పారితముచేయించి దానిని రాష్ట్రపతికి సమర్పించిన యనంతరముననే తప్ప, ఉచ్చతమ న్యాయాలయపు న్యాయమూర్తిని పదవీచ్యుతినిగా చేయుటకు వీలులేదు.

# సార్వజనిక విత్తములపై సంవిధాన నియంత్రణము
## (కంట్రోలు)

ఈ జగత్తంతయు ధనమూలమే కావచ్చునేమో; కాని పరిపాలనమాత్రము నిజముగా ధనమూలమే. 2250 ఏండ్లకు పూర్వమే మన కౌటిల్యుడు "సమస్త వ్యాపారములును అర్థముమీదనే ఆధారపడియున్న" వని చెప్పెను. సంవిధానము ప్రకారము కేంద్ర ప్రభుత్వముయొక్క గాని, రాజ్యములయొక్క గాని ప్రతినిధులుగా నున్న విధానమండలులు పరిపాలనను సాగించుటకు కార్యపాలక వర్గమునకు కావలసిన విత్తములను ప్రజల తరపున అనుదాన (గ్రాంటు) మిచ్చును. అనగా, పరిపాలనయందలి సైన్యము, పోలీసు, కార్యదర్శిక వర్గము, జిల్లా ఆఫీసులు, మొదలైన వివిధ శాఖలను నిర్వహించుటకును, విద్యగరపుట, ఆరోగ్యమును కాపాడుట, ఆసుపత్రులు, ఔషధశాలలు, రోడ్లు, బావులు మొదలైన వివిధ సేవలను ప్రజలకు చేయుటకును విత్తములను అనుదానము చేయును

పన్నుల చెల్లించునదియు, ప్రభుత్వము కోరియున్న ఋణములకు చందారూపమున సొమ్ము అప్పిచ్చు వాడును పౌరుడే. అందుచేతనే అతని క్షేమము కొరకే, ఏ కార్యముల నిమిత్తము ప్రభుత్వము సొమ్ము

కోరియున్నదో దానికే అనుదాన మిచ్చిన ధనమును ఖర్చు చేసినదా లేదా యని చూచుకొనుట. ఆ మొత్తములను పొదుపుగా వాడినదా లేక దూబరాగా వాడినదా అని చూచుకొనుట పౌరుని కర్తవ్యములై యున్నవి. ప్రజల సొత్తును రక్షించుటకై సంవిధానము ఈ క్రింది సాధన పద్ధతులను ఏర్పాటు చేసి యున్నది :-

(1) రాజ్యములలో కాని, కేంద్రమున గాని ప్రభుత్వము ధనముకొరకై అభియాచనలను (డిమాండ్సు), రాజ్యములలో విధానసభయొక్క, కేంద్రమున లోకసభయొక్క సముఖమున చేయవలసి యున్నది; అట్టి మొత్తములను ఆయా ప్రభుత్వముల విధానమండలులు మంజూరు చేయవలసి యున్నది.

(2) విధానమండలులచే అనుదాన మీయబడిన మొత్తములు ప్రభుత్వము పేర్కొనినటువంటివిన్ని, విధానమండలి అంగీకరించి యున్నటువంటివిన్ని నిశ్చిత ప్రయోజనములకే ఖర్చు పెట్టబడవలెను. ఏ ఒక ప్రత్యేకమైన పద్దులో కాని, మొత్తముమీద గాని, ఖర్చు జేసిన సొమ్ము హెచ్చుకారాదు.

ఇంగ్లీషు కామన్సు సదనముయొక్క, పూర్వపు ఇండియాయొక్క ఆచారముల ననుసరించి, కేంద్రము నందు, రాజ్యములందు ప్రతి ఒక విధానమండలికి ఒక ప్రత్యేకపు సార్వజనీయ లెక్కల సమితి (పబ్లిక్

ఎకౌంట్సు కమిటీ) ని ఏర్పాటుచేసి యున్నారు ఆ యా విధానమండలులు ఎన్నుకొనిన సభ్యులతో యీసమితి ఏర్పడియున్నది. ముందు సంవత్సరపు లెక్కలను, అనగా అంచనాలను, ఖర్చులను తనిఖీ చేయుట విధానమండలి పారితము చేసిన ఖర్చులయొక్క పంథాలను, అంశములను, ఆదేశములకు భిన్నముగా ఏమైన ప్రభుత్వము, లేక పరిపాలనాశాఖ, లేక సర్కారు ఆఫీసు, ఖర్చుచేసియున్న యెడల దానిని వెల్లడిచేయుట అనునవి దాని కర్తవ్యములు.

## నియంత్రక - మహాలేఖా పరీక్షకుడు

(కంట్రోలరు - ఆడిటరు జనరల్)

సార్వజనీయ లెక్కల సమితియొక్క తనిఖీ, నియంత్రణమేగాక, వాటికి అదనముగా నియంత్రక - మహాలేఖాపరీక్షకుడను పేరుగల ఒక పక్షపాతరహితుడైన ఉద్యోగస్థుని నియోగించి యున్నారు. 149 వ విభాగ ప్రకారము ఇండియా ప్రభుత్వముయొక్క, రాజ్యముల సర్కారులయొక్క లెక్కలనుకట్టి వాటిని ఒకటే లెక్కగా కూర్చుట; వాటిని తనిఖీచేసి, అవి ఆ యా వివిధ విధానమండలులు పారితముచేసిన పంథాలకు, అంశములకు, ఆదేశములకు సరిగా సరిపోయినవా అని చూచుటయును ఆయన కర్తవ్యములు. కేంద్ర, రాజ్య ప్రభుత్వములయొక్క లెక్కలపై నియంత్రక - మహా

లేఖాపరీక్షకుని నివేదికలు సందర్భానుసారముగా రాష్ట్రపతికిని, రాజ్యపాలకునకును సమర్పింపబడును; వాటిని వారు విధానమండలులకు సమర్పింతురు. ఈ తనిఖీయును, నివేదికయును ఉపయోగకరముగా నుండవలెనన్న అవి వీలైనంతవరకు ఖండితముగాను, నిష్పాక్షికముగాను ఉండవలెను.

నియంత్రక మహాలేఖాపరీక్షకుని నియుక్తియును, ఉద్యోగపు అవధిమరలేలును ఉచ్చతమ న్యాయాలయపు న్యాయాధీశుని సందర్భపు పద్ధతుల మీదనే ఏర్పాటైనవి:

(1) ఆయనను రాష్ట్రపతియే నియమించును.

(2) ఆయన ఉద్యోగపు అవధి కాలము ముగిసిన తప్ప, లేక ఉచ్చతమ న్యాయాలయపు న్యాయమూర్తి సందర్భములోవలె, పార్లమెంటు ఓటుచేతతప్ప ఆయనను వేరువిధముగా పదచ్యుతుని చేయుటకు వీలులేదు.

(3) ఆయన వేతనము, బత్తాల భారము సంచిత నిధిపై వేయబడియున్నవి. అందువలన అవి పార్లమెంటు యొక్క వార్షిక ఓటునకు లోబడకుండ చేయబడినవి.

## విత్త ఆయోగము
### (ఫైనాన్సు కమిషను)

రాష్ట్రపతి విత్త ఆయోగమును స్థాపించును. పౌరుడు రాజ్యమునకిచ్చిన ధనముయొక్క వాడుకను

శాసించు సంవిధానపు ఏర్పాటులలో నిది యొకటి. సంవిధాన ప్రకారము కేంద్రప్రభుత్వమనియు, రాజ్యముల సర్కారులనియు, రెండు తరగతుల ప్రభుత్వములున్నవి కదా. శుల్కములను (Duties), పన్నులను కేంద్రప్రభుత్వము విధించుటయు, రాజ్యములలోని పౌరులనుండి వాటిని వసూలుచేయుటయు జరుగుచున్నది. ఈ శుల్కములలోను, పన్నులలోను కొన్ని, అనగా, రాబడిపన్ను, సీమాసుంకము (కస్టమ్సు డ్యూటీస్) వంటివి, హెచ్చు ఆదాయము తెచ్చునట్టివి. రాజ్యముల ప్రభుత్వములు, వాటి ద్రవ్య సాధనములు (రిసోర్సెస్) కేంద్రప్రభుత్వపు వాటివలె విశేషముగ ఆదాయము తెచ్చునట్టివి కాకపోవుటచే జమాఖర్చులను సరిపెట్టుకొనలేకపోవుచున్నవని పూర్వపు అనుభవము వలన స్పష్టమగుచున్నది. ఈ కారణములవలన 280 వ విభాగప్రకారము రాష్ట్రపతి ఒక విత్త ఆయోగమును 5 ఏండ్ల కొకసారి నియోగించును. దానిలో ఒక సభాపతియు, 4 గురు ఇతర సదస్యులు ఉందురు.

ఈ క్రిందివి ఈ ఆయోగము యొక్క కర్తవ్యములు:

(1) కేంద్రప్రభుత్వ, రాజ్యప్రభుత్వములమధ్య విభజింపబడవలసిన పన్నులద్వారా వచ్చు నికరాదాయమును ఈ రెండు ప్రభుత్వములకును ఎట్లు పంచవలసియున్నదో రాష్ట్రపతికి సిఫారసు చేయుట.

(2) రాబడిలోని వాటి వాటి భాగములను రాజ్యములమధ్య పంచియిచ్చుట ;

(3) ఇండియా ప్రభుత్వ రెవిన్యూల నుండి ఏ కాలమందైన, ఏ రాజ్యమునకైన, యివ్వవలసిన సాహాయ్యక అనుదానములను శాసించు సూత్రములను సిఫారసు చేయుట అనునట్టివి ముఖ్యకర్తవ్యములు.

కేంద్రప్రభుత్వము, తమకు పన్నులద్వారా సంప్రాప్తమైన ఆదాయమును ఎట్లు రాజ్యప్రభుత్వములకు విభజించి యివ్వవలసియున్నదో ఆ పంపకపు సూత్రముల గూర్చి విత్త ఆయోగము కేంద్రప్రభుత్వమునకు సలహా నిచ్చును. ఈ సిఫారసు లన్నింటిని కేంద్ర పార్లమెంటుకు తెలియచెప్పుదురు. ఎందుకనగా, విత్త ఆయోగము చేసిన ప్రతిసిఫారసును, దానితో సహా, దానిపై కేంద్రప్రభుత్వము తీసికొనిన చర్యపై వ్యాఖ్యతో కూడిన విజ్ఞాపనను రాష్ట్రపతి ప్రతి ఒక పార్లమెంటు సదనము సమక్షమున ఉంచవలెను.

## కేంద్ర, రాజ్యప్రభుత్వముల సంబంధ బాంధవ్యములు

ఇండియాలో రెండు తరగతుల ప్రభుత్వములు ఉన్నవని మనకు తెలియును. ఇవి మొత్తముమీద ఇండియా ప్రభుత్వమున్ను, ఇండియా సమాఖ్యలోని

రాజ్యముల ప్రభుత్వములున్నవి. వాటిమధ్య ఎట్టి సంఘర్షణ, తగాయిదా ఉండకుండగా వాటికి గల సంబంధ బాంధవ్యములను ఇండియా సంవిధానము నిర్వచించి, నిశ్చయపరచవలసి యున్నది. (అట్లే మన సంవిధానము కావించి యున్నది.) విధులు, విధి నిర్మాణశక్తి విషయములలో 345వ విభాగము రాష్ట్రములకు కుత్తముగా కేంద్ర ప్రభుత్వము విధులను చేయవచ్చునని స్థూలముగా చెప్పియున్నది. అంతకంటె స్పష్టముగా తరవాతి 246వ విభాగము సమాఖ్య జాబితా (యూనియన్ లిస్టు) అను జాబితాలో ఉదహరింపబడియున్న విషయములపై కేంద్రప్రభుత్వమునకు మాత్రమే శక్తియున్నదని స్పష్టముగా నిర్ధారణ చేయుచున్నది.

ఈ పరిపాలనాంశములు ఇండియా నంతకు మొత్తముగా వర్తించునట్టి అంశములు. వాటిని రాజ్యములకు అప్పగించుటకు వీలు లేదు. అవి సార్వ ద్భారత జాతీయ స్వభావము, ప్రయోజనము కల్గి యున్నవి. వివిధ రాజ్యముల ప్రభుత్వములకు వాటిని వదలివేసిన యెడల గందరగోళమునకు, అరాచకమునకు, బలహీనతకు దారితీయును. అట్టి విషయము లేవనగా : 1. ఇండియా ప్రతిరక్షణ; 2. ఇండియాకును విదేశములకు గల సంబంధములు, అనగా విదేశవిధానము; 3. రాష్ట్రము

లోను, బయటను వర్తక, వ్యాపారములను శాసించుట; 4. రైల్వేలు, హైరోడ్లు, విమానమార్గములకు సంబంధించిన రహదారీ విధానమును సంఘటించుట; 5. తపాలా, తంతివార్త పద్ధతి; 6. దేశము మొత్తమున వివిధ ప్రాంతములలో నివసించు ప్రజల అక్కరల తీర్చునట్టి, మొత్తముగా ప్రజలయొక్క సంక్షేమమును పెంపొందించునట్టి, ప్రజల జీవితమును. చైతన్యమును వృద్ధిచేయునట్టి ఏర్పాటులను, విధులను చేయుట.

ఈ కర్తవ్యము లన్నింటిని నిర్వహించుటకు కేంద్ర ప్రభుత్వమునకు ధనము కావలసియున్నది. పన్నుల విధించు శక్తియు, అధికారమును అందుకొరకే ఇండియాప్రభుత్వమున కీయబడినవి. ఇట్టివి 97 విషయములు, ఇండియా సమాఖ్య జాబితాకు చెందిన విషయములని, సంవిధానపు 7 వ అనుసూచిలో లెక్కింపబడినవి. అయితే, వాటి నన్నింటిని పైన చెప్పియున్న ముఖ్య శీర్షికలలో ఏదైన నొకదాని క్రిందకు తేవచ్చును.

వీటిని ఇండియా సమాఖ్య జాబితాలో చేర్చుట సమంజసమేనని విశేషముగా తర్కించవలసిన అవసరము లేదు. ఇండియా ప్రతిరక్షణ కేంద్రప్రభుత్వము చేతిలోనే ఉంచవలెను. యుద్ధములో విజయమునకై — కేవలము ఆత్మరక్షణ కొరకైన యుద్ధములో విజయమునకైనను—ఏకైక నాయకత్వము, శక్తి కేంద్రీ

కరణము, కేంద్రమునుండి నడిపించుటయు కావలసి యున్నవి. ఇట్టి ప్రతిరక్షణ సంఘటనకై (ఆర్గానిజేషన్) ధనము వినియోగించుటలో పొదుపుకొరకై నను ఐక్యతయు, కేంద్రప్రభుత్వము చేతిలో కేంద్రీకరించుటయు అవసరములు. అదియే దేశముయొక్క ప్రతిరక్షణకై జవాబుదారీ వహించి దాని అక్కరల తీర్చగలదు. ప్రతియొక రాజ్యమునకు వేరుగా సైన్యము ఉండినయెడల, వేర్వేరు ప్రభుత్వములక్రింద వాటివాటి ప్రధాన సేనాను లుండినయెడల, ప్రతి ఒక రాజ్యము తనయొక్క ద్రవ్యాధారములనుండి తన సైన్యమునకు ఖర్చు చేయవలసి యున్నయెడల, ఇండియా ప్రతిరక్షణయొక్క భవితవ్య మెట్లుండునో మనము ఊహించవచ్చును. జాతీయ రక్షణను కేంద్రప్రభుత్వమునకిచ్చుటలోని ఔచిత్యమును ఋజువుచేయుటకు చారిత్రకానుభవమే కావలసినంత యున్నది. దీనిని పోలి యున్న సమాఖ్యలు, లేక ఫెడరేషను లగు స్విట్జర్లాండు, కెనడా, ఆస్ట్రేలియా, అమెరికా సంయుక్తరాష్ట్రములలో దేశముయొక్క రక్షణ జాతీయ ప్రభుత్వమునకే ఒప్పచెప్పబడినది.

ఇట్టి ప్రకారముగానే, జాతీయ క్షేమమునకు సంబంధించిన విషయము లన్నియుకూడ వర్తించును. ఒక రాష్ట్రమునకు ఒకే విదేశవిధాన ముండవలయునే

కాని, దానిలో ఎన్ని రాజ్యములున్నవో అన్ని విదేశ విధానము లుండరాదు. అట్టి విధముగానే, ఏకైక విధానమున్నప్పుడే దేశీయ వర్తక వ్యాపారము అత్యంతము అభివృద్ధి చెందును. అంతేగాని వచ్చుచు, పోవుచున్న సరకుల మీద రాజ్య మాధ్యస్థముగు సుంకముల విధించుటకు శక్తి కలిగి, ప్రతి రాజ్యము వేర్వేరు విధానముల నవలంబించిన యెడల అది క్షీణించుచుపోవును. ఇతర దేశములతోటి వ్యాపార విషయమునందును ఈ సత్యము ఇంకను స్పష్టమగును. ప్రతియొక రాజ్యము తనయొక్క ఎగుమతి, దిగుమతి సుంకములను తనయొక్క రేటులలో విధించుటకు అధికారము కలిగియుండినపుడు కంటె, ఒక దేశముయొక్క అంతర్జాతీయ వ్యాపారము, ఒకే ప్రభుత్వము ఎగుమతి, దిగుమతి సుంకములను, రక్షణ సుంకములను (ప్రొటెక్టివ్ టారిఫ్) విధించుటకు అధికారము కల్గియున్న యెడల, ఎంతో హెచ్చు లాభసాటిగా జరుగగలదు. అలాగుననే, జాతీయము, సర్వతోముఖమునగు విధానము అవలంబించగల ప్రభుత్వము జాతీయ రాచబాటలు మొదలు తపాలా తంతి వార్తలవరకు, జాతీయ రహదారుల అభివృద్ధికి దోహదము చేయగలదు. జాతీయ ఐక్యతకు సాధనగా, ఒకేవిధమైన విధి, పద్ధతియు, విధుల సంహితము (కోడ్) అన్ని దేశములందు ఉపకరించినవి.

అది యిటునుంచి దీనికంతకు వేరు విధానము అవసరముగు నట్టి కొన్ని లోకసేవలున్నవి. వానికి ప్రతియొక రాజ్యము, దానియందలి ప్రజలయొక్క ప్రత్యేకపు అక్కరల ప్రకారము, ప్రత్యేకపు పరిస్థితుల ప్రకారము, ప్రత్యేక ఉన్నతి ప్రకారము, పరిపాలింపబడు అత్యంత శ్రేష్ఠమైన విద్య, ఆరోగ్యము, ఇతర విధములగు సాంఘిక సంక్షేమము, వ్యవసాయము, పరిశ్రమలు, అడవులు, రోడ్లు మొదలైన ఒక్కొక్క రాజ్యమునకు మాత్రమే చెందినటువంటి పరిపాలనా విషయములున్నవి. ఒకే రాజ్యమునకో ... చెందిన యెడలనే కొన్ని విషయముల పరిపాలన సమర్థతతో జరుగును. అటువంటి — ప్రతియొక రాజ్యము దాని స్వంత విధాన ప్రకారము జరిపిన యెడల జయప్రదముగానుండునట్టివి — ... జీవనమును, శాంతిని, భద్రతను పోషించుటకు మొదలైనవి.

పైగా, ఈ ప్రయోజనముల కన్నిటికి అవసరమగు విధుల నిర్ణయించుశక్తియు, దానితోపాటు వాని ప్రయోజనముల నిమిత్తమై ధనము వినియోగము చేయుటకు శక్తియు రాజ్యముయొక్క విధానమండలికి సంక్రమింపవలెను. అదియునుగాక, మన సంవిధానము వంటి స్వతంత్ర, ప్రజాస్వామ్య సంవిధానము

స్వపరిపాలన నిమిత్తమై ప్రజలకు అవకాశము లివ్వ వలెను. అందుచేతనే జాతీయ ప్రాముఖ్యము, ప్రయోజనము లేని విషయములు రాజ్యములచే స్థానికముగా పాలింపబడిననే ఎంతయో శ్రేయోదాయకము. అందువల్ల ప్రతిరాజ్యములోని ప్రజలు, వారికి సన్నిహితముగా నున్న రాజ్యవిధాన మండలులద్వారాను, ప్రతినిధులగు మంత్రులద్వారాను తమకు కావలసినట్లు విధానములను, ప్రణాళికలను దిద్దుకొనుటకు హక్కు కలిగి యుందురు. వారికి గల కోరికల ప్రకారము, అక్కరల ప్రకారము ఆ విధానముల, ప్రణాళికల వలన లభించు ఉపకారముల గూర్చి వారికున్న అభిప్రాయ ప్రకారము పనిచేయుటకు శక్తి కలిగియుందురు. అందువలన దానియొక్క విధినిర్మాణ, కార్యపాలక, న్యాయపాలక సంస్థలను పోషించుకొనుట రాజ్యము యొక్క అధికారములోనే యున్నది. ఇట్లు రాజ్యములకు పంచి యిచ్చినటువంటి విషయములు 66 కలవు. ఇవి 7 వ అనుసూచిలో రాజ్య జాబితా అను పట్టిలో పేర్కొనబడినవి. మనము పైనఉదహరించిన ప్రధాన శీర్షికల క్రిందకు ఈ విషయములన్నియు వచ్చును.

ఈ రెండు జాబితాలకు అదనముగా 7 వ అనుసూచిలో సమవర్తి జాబితా (కన్‌కరెంటు లిస్టు) అను మూడవ జాబితా కలదు. అమెరికా సంయుక్త

రాష్ట్రములవంటి కొన్ని రాజ్యముల సమాఖ్యలలో కేంద్ర, రాజ్య ప్రభుత్వములయొక్క కార్యకలాప ఆవరణను నిశ్చితముగాను, ఖండితముగాను తీర్చి వ్రాయుటకు వీలైనది. కాని, చారిత్రికమైన కారణముల వలన మరికొన్ని సమాఖ్యలలో రాజ్య ప్రభుత్వముల కిచ్చిన విషయములలోకూడ జోక్యము కలుగ చేసుకొనుటకు కేంద్రప్రభుత్వమునకు శక్తి యివ్వబడినది. ఈ కారణములలో ఒకటి — ఇప్పుడు రాజ్యముల కివ్వబడిన శక్తిని అంతకు పూర్వమే కేంద్రప్రభుత్వము చెలాయించియుండుట; రెండవది — పలుముఖములుగా పోవునట్టి, విచ్ఛిన్నము చేయునట్టి పోకడలవలనను, లేక జాతీయ ఐక్యత పరిపూర్ణము కానందున సంభవించు అనర్థములవలనను అపాయము లేకుండునట్లు కేంద్ర ప్రభుత్వముయొక్క క్షేత్రాధికారమును, అధికారమును ప్రస్తుత రాజకీయ పరిస్థితులబట్టి విస్తరించుట అవసరమగుట.

ఇవన్నియు సమవర్తి జాబితాలో (Concurrent List) ఉంచబడినవి. మన సమాఖ్యవంటి కెనడా, ఆస్ట్రేలియా మొదలైన యితర సమాఖ్యల సంవిధానములలోకూడ ఇటువంటి సమవర్తిజాబితాలకు ఏర్పాటు చేయబడియున్నది. అయితే, మన సమవర్తి జాబితా వాటి దానికంటె దీర్ఘతరమైయుండుటకు కారణము,

వాటితో పోల్చినయెడల, మన జాతీయ ఐక్యత అంత బలముగాను, సుస్థిరముగాను లేకుండుటే. మన సమవర్తి జాబితాలో 47 విషయములున్నవి. వాటిలో క్రిమినలు విధులు, క్రిమినలు చర్యలు, సివిలు చర్యలు, వివాహములు, దాని విచ్ఛేదమున్ను, సార్వజనిక క్రమ జీవనము, వారిని పోషించుట, సమాంధ్ర సంక్షేమము, వారి సాంకేతిక శిక్షణ పార్లమెంటుచే జాతీయ ప్రాముఖ్యము కలవిగా ప్రకటించబడిన కట్టడములు, న్యాయస్థానముల క్షేత్రాధికారములు, శక్తులు, కర్మాగారములు, వార్తా పత్రికలు, పుస్తకములు, ధర్మాదాయములు, ధర్మసంస్థలు అను విషయములన్నియు చేరియున్నవి.

రాజ్యప్రభుత్వములకు ఈ విషయములపై క్షేత్రాధికారమివ్వబడినను ఈ సమవర్తి జాబితాయందలి విషయముల గూర్చి కూడ చట్టము తీసికొనుటకు కేంద్ర విధానమండలియు, ప్రభుత్వమును అధికారము కలిగియున్నవి. కేంద్రప్రభుత్వముయొక్క అధికార సంవిధానమందలి 254 వ విభాగము ఇంకను బలపరచుచున్నది ఈ విభాగ ప్రకారము, సమవర్తి జాబితాలో నుదహరించబడిన విషయములలో నేదైననొకదానిమీద కేంద్రపార్లమెంటు పారితము చేసియున్న విధులకును, రాజ్యవిధాన మండలి పారితము

చేసియున్న విధులకున్ను మధ్య వైరుధ్యము, అసంబద్ధత ఉన్నయెడల, కేంద్రపార్లమెంటు చేసిన విధియే యీసందర్భమున వర్తించి తీరవలయును.

అంతేగాక, 249 వ విభాగ ప్రకారము రాజ్యముల జాబితాలోని ఏ విషయము గురించియైనను విధులను నిర్మించుటకు కేంద్రపార్లమెంటుకు శక్తియున్నది. అయితే ఈ శక్తిని ప్రయోగించుటకు సందర్భమేదనగా: రాజ్యములకు పంచి యివ్వబడిన రాజ్యజాబితాలోని ఏ విషయము గూర్చియైనను పార్లమెంటు విధులను చేయుట అవసరమని, యుక్తమని కేంద్రరాజ్యసభలో హాజరై, ఓటు వేసిన సదస్యులలో మూడింట రెండు వంతుల సంఖ్యచే ప్రకటింపబడినపుడు, పార్లమెంటు జోక్యము కలుగ చేసికొనవలెను. దీనికికూడ మించి సంవిధానమందలి 248 వ విభాగముచేత కేంద్రపార్లమెంటు యొక్క అధికారము విస్తరించబడినది. రాజ్య జాబితాలోగాని, సమవర్తి జాబితాలోగాని ఉదహరించని ఏ విషయముయొక్క సందర్భములోనైనను ఏ విధినైనను చేయుటకు పార్లమెంటుకు అనన్యమైనటువంటి శక్తి కలదు. సంవిధానపు భాషలో, 'శేషించిన'[1] విధినిర్మాణ శక్తులన్నియు కేంద్ర ప్రభుత్వమునకు చెందియున్నవి ... అని చెప్పవలెను మోరి సా

---

1 'శేషించిన' అనగా ఏ జాబితాలోనూ ఉదహరించనివి.

సంయుక్తరాష్ట్రముల సంవిధానములో యిట్లులేదు. అక్కడ 'శేషించిన' శక్తులన్నియు వివిధరాజ్యముల ప్రభుత్వములకే చెందినవి.

దీని నంతను బట్టి తేలిన సారమేమనగా: ఇండియాలో మన సంవిధానము ప్రవేశపెట్టిన ప్రభుత్వ పద్ధతి అమెరికా సంయుక్తరాష్ట్రములలోను, స్విట్జర్లాండులోను, కెనడా, ఆస్ట్రేలియాలలోను ప్రయుక్తమైయున్న ఫెడరేషనువంటిది కాదు. ఇచట రాజ్యముల ప్రభుత్వములకంటె కేంద్ర ప్రభుత్వమునకే హెచ్చుగా శక్తులును అధికమైన క్షేత్రాధికారమును కలవు. అందుచేతనే మన పద్ధతిని ఫెడరేషను అని కాక 'సమాఖ్య'[1] అని పిలుచుచున్నారు.

## కేంద్రప్రభుత్వమునకు రాజ్యప్రభుత్వములకును పరిపాలనా సంబంధ బాంధవ్యములు

విధులు, విధినిర్మాణము అను విషయములలో వలెనే, పరిపాలనావిషయములో కూడ కేంద్రరాజ్యప్రభుత్వములమధ్య వారివారి క్షేత్రాధికార భాగములను విభజించుటకు సంవిధానము ఏర్పాటు చేసియున్నది. ప్రతియొక్క ప్రభుత్వము, వారికి ఏ విషయములలో విధి నిర్మాణమున కధికారముకలదో, వాటిపై కార్య

[1] 'సమాఖ్య' — యూనియన్.

పాలక అధికారమునుకూడ కలిగియున్నది. 73 వ విభాగ ప్రకారము ఏవిషయములగూర్చి పార్లమెంటుకు విధుల నిర్మించుట కధికారము కలదో వాటన్నింటికి కేంద్రప్రభుత్వపు కార్యపాలకశక్తి విస్తరించవలెను. అటులనే, 162 వ విభాగ ప్రకారము ఏవిషయములలో రాజ్యవిధానమండలికి విధుల చేయుటకు శక్తికలదో, ఆ విషయములపై రాజ్యప్రభుత్వముయొక్క కార్యపాలకశక్తి విస్తరించవలెను. కనుక, 7 వ అనుసూచిలో ఉన్నటువంటి పరిపాలనా విషయముల సమాఖ్య జాబితాలో లెక్కింపబడిన విషయము లన్నింటిపైన కేంద్ర ప్రభుత్వమునకు కార్యపాలక అధికారముండును. కాని, 7 వ అనుసూచిలోని సమవర్తి జాబితాలో నుదహరింపబడిన విషయములపై కేంద్రప్రభుత్వమునకు రాజ్య ప్రభుత్వములో సహా సమవర్తి కార్యపాలక అధికారముండును.

అయితే అట్టి సమవర్తి అధికారము కల్లోలమునకు, సంఘర్షణకు, స్తంభనకు ( డెడ్ లాక్ ) దారితీయును కనుక, 256 వ విభాగ ప్రకారము, ప్రతి రాజ్యముయొక్క కార్యపాలక శక్తియు పార్లమెంటుచే చేయబడు విధులకును, ఆ రాజ్యములో అప్పటికి ప్రయుక్తమగుచున్న పార్లమెంటు విధులకును అనుగుణముగ నుండునట్లు ప్రయోగింపబడవలెను. పైగా,

కేంద్రప్రభుత్వముయొక్క కార్యపాలకశక్తి. ఆ ప్రభుత్వము ఎందునిమిత్తమైనను అవసరమని తలచునట్టి విదేశములను, రాజ్యములకు వర్తింపచేయుటకుకూడ విస్తరింపవచ్చును. అదియునుగాక, ఈ విభాగప్రకారము, ప్రతి రాజ్యముయొక్క రాజ్యపాలకశక్తియు కేంద్రప్రభుత్వముయొక్క కార్యపాలకశక్తి ప్రయోగమునకు ప్రతిబంధకము కానట్లును ప్రతికూలముగా లేకుండగను ప్రయోగింప బడవలెను.

ఈ విభాగములోని యుద్దేశము విశాలమైనది. సంఘర్షణ, కల్లోలము, స్తంభన సంప్రాప్తమగుటకు వీలున్న విషయములకు మాత్రమే చెల్లునట్లు సూచితమైలేదు. కేంద్ర పార్లమెంటుచే పారితములైన విధులన్నింటిని రాజ్యప్రభుత్వములు అమలు జరుపవలెను. కేంద్రప్రభుత్వము తనకు సంవిధానమిచ్చిన కార్యపాలన అధికారమును ఆ రాజ్యములో ప్రయోగము చేయుటలో రాజ్యప్రభుత్వములు దానితో సహకరించవలయును. దీనికితోడు 261 వ విభాగమువలన కేంద్ర ప్రభుత్వము యొక్కయు ఆయా రాజ్యముల యొక్కయు సార్వజనిక కార్యములు, అభిలేఖలు (రికార్డులు) న్యాయవిషయమైన చర్యలయెడ ఇండియా రాజ్యక్షేత్రమందంతటను సంపూర్ణమైన శ్రద్ధా, ప్రత్య

యములు (క్రెడిట్) చూపబడవలెననికూడ ఏర్పాటున్నది.

అదియునుగాక, అంతర రాష్ట్ర నదులయొక్క, లేక నదీ లోయల నీటియొక్క ఉపయోగమునకు సంబంధించిన వివాదములను పరిష్కరించుటకును, రాష్ట్రపతి ఒక అంతర రాజ్య పరిషత్తును స్థాపించుటకును ఏర్పాటు కావించబడినది. రాజ్యములమధ్య ఉత్పన్నమగు వివాదములగూర్చి సలహానిచ్చుట వాటిని పరిశోధించుటయు ఈ పరిషత్తు కర్తవ్యములు; కొన్ని రాజ్యములకు, లేక అన్ని రాజ్యములకు, కేంద్ర ప్రభుత్వమునకు ఒకే ప్రయోజనమున్న విషయములను పరిశోధన చేయుట, ఆ విషయములపై సిఫారసులను చేయుటయు, విశేషించి విధాన, చర్యలయొక్క ఉత్తమ సమన్వయమునకుగాను సిఫారసులను చేయుటయుకూడ దాని కర్తవ్యములే.

## రాజ్యప్రభుత్వములను నిలంబనచేయుటకు (సస్పెండు) శక్తి

ఇవి సాధారణ సమయములలో వర్తించుటకై కేంద్ర, రాజ్యప్రభుత్వముల మధ్య సంవిధాన మేర్పరచిన సంబంధ బాంధవ్యములు. కాని, సంకట సమయములు (క్రైసెస్), ఆపాతసందర్భములు (ఎమర్జెన్సీ) మొదలైన

అసాధారణసమయములలో కేంద్ర ప్రభుత్వమునకు ఇంకను ఘనమైన శక్తి రాజ్యప్రభుత్వములపై ప్రయోగించుటకై ఇవ్వబడినవి. 352 వ విభాగ ప్రకారము, యుద్ధమువలనగాని, బాహ్య దురాక్రమణ (ఎగ్రెషన్) వలనగాని, అంతః కల్లోలమువలనగాని, ఇండియాయొక్క లేక దానిలోని ఏ భాగముయొక్కయైన భద్రతకు ప్రమాదము కలిగించు తీవ్రమైన ఆపాతము ఒకటి ఏర్పడినదని రాష్ట్రపతి నమ్మినయెడల, అట్లు ప్రకటన చేయవచ్చును. ఈ ఆపాత అవధికాలము 6 నెలల వరకుండవచ్చును; లేదా కేంద్రప్రభుత్వము దానిని కొంతకాలముగా పొడిగించవచ్చును. ఇట్టి ఆపాత సమయమున ఏ రాజ్యముయొక్కయైనను, విత్తీయ శక్తితో (ఫైనాన్షియల్) సహా, కార్యపాలనశక్తి నిలంబన చేయబడును; రాష్ట్రపతి దానిని స్వాధీనము చేసికొని కేంద్రప్రభుత్వములోని తన మంత్రులద్వారా ప్రయోగించును. ఈ విధముగానే కేంద్ర పార్లమెంటు రాజ్యముయొక్క శాసననిర్మాణశక్తినికూడ స్వాధీనము చేసికొనును.

356 వ విభాగము, సంవిధాన తంత్రము రాజ్యములలో విఫలమైన సందర్భములలో, రాష్ట్రపతి కటువైన శక్తులనే యిచ్చుచున్నది. సంవిధానపు ఏర్పాట్ల ప్రకారము రాజ్యములలో ప్రభుత్వమును

సాగించుటకు వీలుకానట్టి పరిస్థితులేర్పడిన సందర్భమిది. ఏ రాజ్యముయొక్కయైన ఉచ్చన్యాయాలపు అధికారమును మాత్రము ఇట్లు రాష్ట్రపతి విలంబన చేయుటకు వీలులేదు; అయితే అపాత అవధిసమయములో, సంవిధానమందు హామీయివ్వబడిన అధికారములను ఆచరణలో పెట్టుటను విలంబన చేయవచ్చును.

## కేంద్రములో లోకసేవాయోగము

## సమాఖ్య లోకసేవాయోగము

(యూనియన్ పబ్లిక్ సర్వీసెస్ కమిషను)

రాజ్యములలో నున్న లోకసేవాయోగముల వలెనే కేంద్రములో సమాఖ్య లోకసేవాయోగమున్నది. రాజ్య ఆయోగములకున్న సంవిధానము, శక్తులు, కర్తవ్యములు దానికికూడ నున్నవి. ఆదాయపు పన్ను, సీమాసుంకములు, ఇండియా లేఖాపరీక్ష, (ఆడిట్) లెక్కల సేవలువంటి కేంద్రజాతీయ సేవలపైన మాత్రమే దానికి క్షేత్రాధికారముకలదు. పూర్వపు ఇండియా సివిలు సేవకు బదులుగా యిపుడు 'ఇండియా పరిపాలనాసేవ' యున్నది. కేంద్రప్రభుత్వమునకే గాక రాజ్యప్రభుత్వములకు కూడ ఉత్తమ తరగతి సేవల నింపుటకు అభ్యర్థులను ఈ సేవలోనే నియోగించుచున్నారు. కేంద్రప్రభుత్వపు పోలీసు

సేవలోనేగాక రాజ్యప్రభుత్వపు సేవలో కూడా పైతరగతుల పదాధికారులు ఇండియా పోలీసుసేవకు చెందియున్నారు. వారి నియుక్తి, క్రమశిక్షణ, దండన మొదలైనవి సమాఖ్యా లోకసేవాదళాల క్షేత్రాధికారములోనున్నవే.

## సంవిధానపు సవరణలు

(ఎమెండ్‌మెంట్సు)

ఎంత చక్కగా ఆలోచించి, ఎంత తెలివిగా పారితము చేసినను, ఏ సంవిధానమైనను సర్వసంపూర్ణముగా నుండదు. పురోగమించుచున్న ప్రజలకును, వృద్ధిపొందుచున్న దేశములోను, సంభవించు పరిస్థితులన్నింటికిని సరిపడునట్లుగా అది ఏర్పాట్లు చేయజాలదు. అందుచేతనే, ప్రతిసంవిధానమందును దానిని సవరించుటకు ఏర్పాటుండును. కాని, సంవిధానము దేశముయొక్క మూలాధార శాసనము గనుక, తన్మూలముగ పౌరునియొక్క అధికారములను అది నిర్వచించి వాటికి హామీనిచ్చును; స్వతంత్ర ప్రభుత్వముయొక్క అవసర సంస్థల కర్తవ్యములను, కృత్యములను విరచించును; అందుచేత, సంవిధానపు సవరణ వీలైనంత కష్టసాధ్యముగాను, ఆలస్యమగునట్లును ఉండును. అందువలన, ఈ సవరణ ప్రజలు బుద్ధిపూర్వకముగా,

బాగుగా ఆలోచించి ఏర్పరచుకున్న అభిప్రాయ ఫలితము కాగలదు. అంతేకాని, జనసమాజములోని ఒక బలమైన తరగతి, లేక పక్షమునకు కల్గిన తాత్కాలిక ఆవేశమునకు, చిత్తవికారమునకు ఫలితముకారాదు.

ఈ ప్రకారము, అమెరికా సంయుక్తరాష్ట్రముల సంవిధానమునం దేభాగము నైనను సవరణచేయుటకు సమాలోచన నిర్ణయములకై బహుదీర్ఘమై, మిక్కిలి శ్రమతోకూడిన కార్యకలాపము అవసరమైయున్నది. కాంగ్రెసు అనబడు ఫెడరల్ విధాన మండలిలో ప్రతి ఒక సదస్సమందలి సదస్యులలో మూడింట రెండు వంతులు ఫలానా సవరణను ప్రతిపాదించుటకు సమ్మతించవలెను. లేదా వివిధ రాజ్యములలో మూడింట రెండువంతుల విధానమండలులు కోరిన సవరణను ప్రతిపాదించుట కేర్పడిన సమితి (కమిటీ) యు, వివిధ రాజ్యములలో నాల్గింట మూడువంతుల విధానమండలులు కలిసి యా సవరణను ఆమోదించుటకు సమ్మతింపవలయును. స్విట్జర్లాండులో సంవిధానపు సవరణలు జనవాణి పలికినరీతిగా జరుగును. ఈ పద్ధతికి నిర్దేశ విధానము (రిఫరెండము) అని పేరు. ప్రతిపాదించిన సవరణ విషయమై తమ యభిమతమును తెలుపుడని కోరుచు ఆ సవరణను ప్రజలకు నిర్దేశింతురు.

అయితే, ఇండియాలో సంవిధానపు సవరణలు

మొత్తముమీద సులభసాధ్యములే. 368 వ విభాగ ప్రకారము, పార్లమెంటుయొక్క ఏ సదనమందైనను అందు నిమిత్తము ఒకబిల్లును ప్రవేశపెట్టుట మూలముగా మాత్రమే ఉపక్రమింప బడవలెను. ఆ బిల్లు ప్రతిసదనములోను దానిలోని మొత్తపు సదస్యులలోని అధికసంఖ్యచేతను, హాజరై ఓటుచేయు సదస్యులలో మూడింట రెండువంతులకు తక్కువకాని సదస్యుల అధిక సంఖ్య చేతను పారితమైనపుడు, అది రాష్ట్రపతి అనుమతి నిమిత్తము అర్పింపబడవలెను. ఆ బిల్లుకు అట్టి అనుమతి ఇయ్యబడినమీదట, సంవిధానము ఆ బిల్లునందలి నిబంధనల ప్రకారము సవరింపబడవలెను.

అయితే, అట్టి సవరణ, రాష్ట్రపతి ఎన్నికకు సంబంధించిన 54 వ అనుచ్ఛేదములోను (ఆర్టికిల్) లేక రాష్ట్రపతిని ఎన్నుకొను పద్ధతితో సంబంధించియున్న 55 వ అనుచ్ఛేదములోను, లేక కేంద్రప్రభుత్వముయొక్క కార్యపాలక శక్తి విస్తీర్ణతకు సంబంధించిన 75 వ అనుచ్ఛేదములోను లేక రాజ్యప్రభుత్వముల కార్యపాలకశక్తి విస్తీర్ణతకు సంబంధించిన 162 వ అనుచ్ఛేదములోను, లేక చిన్నరాజ్యముల (అనగా బ్రిటిషుయుగపు ఇండియా సంస్థానములు) ఉచ్చన్యాయాలయములకు సంబంధించిన 241 వ అనుచ్ఛేదములోను. లేక కేంద్రన్యాయపాలకవర్గము, ఉచ్చ

తమన్యాయాలయముతో సంబంధముగల అనుచ్ఛేదము లోను, లేక రాజ్యములలోని ఉచ్చన్యాయాలయము లకు సంబంధించిన అనుచ్ఛేదములోను, లేక కేంద్ర, రాజ్య ప్రభుత్వములకు మధ్యగల విధినిర్మాణ బాంధ వ్యములకు సంబంధించిన అనుచ్ఛేదములోను, లేక కేంద్ర, రాజ్య ప్రభుత్వములమధ్య విభజింపబడిన పరిపాలనా విషయముల జాబితాలలో నే యొకదానితో సంబంధించియున్న అనుచ్ఛేదములోను, లేక కేంద్ర విధానమండలిలో రాజ్యముల ప్రాతినిధ్యముతో సంబం ధించిన అనుచ్ఛేదములో, లేక యీ అనుచ్ఛేదములోని సంవిధానపు సవరణలకు సంబంధించిన విభాగములలో కాని — ఒకానొక సవరణ తేదలచుకొనినయెడల ఒక టవ అనుసూచిలో ఎ, బి విభాగములలో పేర్కొన బడిన పెద్దరాజ్యములలో సగమునకు తక్కువ కాకుండ విధానమండలులు ఆ సవరణను ఆమోదించవలసి యున్నది. ఆ ప్రయోజనము నిమిత్తము తీర్మానము లను పారితము చేయవలెను. అపుడే అట్టి సవరణకు ఏర్పాటు చేయునట్టి బిల్లు రాష్ట్రపతికి, ఆయనసమ్మతికై అర్పించబడును.

మూలాధార అధికారములతో సంబంధించి యున్నముఖ్యభాగము దీర్ఘతర సమాలోచనతో కూడిన ఇట్టిచర్యకు అధీనమైలేదని మనము గమనింపవలెను.

సంవిధానమును సవరించుట ఇంత సులభసాధ్యముగా చేయబడినది గనుక జనవరి 26, 1950 తేదీని అమలులోనికి వచ్చినపిమ్మట 6 ఏండ్లలోనే సంవిధానము 4 సారులు సవరింపబడినందుల కాశ్చర్యపడనక్కర లేదు.

1951 వ సంవత్సరములో పారితమైన మొదటి సవరణ 15 వ అనుచ్ఛేదమును సవరించి, అస్పృశ్యులు, అనుసూచిజాతులు, ఆదిమజాతులు, అనుసూచి కులములు మున్నగు సాంఘికముగాను, వైజ్ఞానికముగాను వెనుకబడియున్న తరగతుల పౌరులను ఉద్ధరించుటకై ఏదైన ప్రత్యేకపు ఏర్పాటుచేయు నిమిత్తము రాజ్య ప్రభుత్వములకు వీలొసంగుచున్నది. దీనికి కారణము మదరాసు రాజ్యమునకు, చంపకందొరై రాజునకును జరిగిన దావాలో ఉచ్చతమ న్యాయాలయముయొక్క తీర్పు ప్రభుత్వమునకు వ్యతిరేకముగా నుండుటయే.

ఈ సంవత్సరములో చేయబడిన సవరణ 31 వ అనుచ్ఛేదమునకు అదనముగా 31–ఎ, 31–బి అను మరిరెండు అనుచ్ఛేదములను కలిపియున్నది. 31 వ అనుచ్ఛేదము రాష్ట్రము ఏదైన ఎస్టేటును, లేక హక్కులను ఆర్జించుటకు ఏర్పాటుచేసినది. ఈ క్రొత్త అనుచ్ఛేదములు ఏదైన రాజ్యముచేసిన విధినిర్మాణము ఏదైన ఎస్టేటులను ఆర్జించు సందర్భమున కేవలము అట్టి విధినిర్మాణము సంవిధానములో హామీ యివ్వ

బడిన మూలాధార అధికారములకు అసంబద్ధముగా యున్న కారణమున శూన్యము, నిరర్థకము కాకుండ దానిని కాపాడుచున్నవి.

1952 లో పారితమైన రెండవ సవరణ జనాభాలోని ప్రతి ఒక 50,000 మందికి ఒక సదస్యునికంటె ఎక్కువ ఉండరాదని శాసించినది. (పూర్వపు నియమము ప్రకారము జనాభాలో ప్రతి ఒక 750,000 మందికి ఒక సదస్యునకు తక్కువ కాకుండ నుండవలెను.)

1954 పారితమైన మూడవ సవరణ, జాతీయ, ఆర్థిక వ్యవస్థ ప్రయోజనముల నిమిత్తము ఎంతకాలము వలెనని కోరిన అంతవరకు కొన్ని సరకులపై కేంద్ర ప్రభుత్వమునకు నియంత్రణాధికార మిచ్చినది.

31 వ అనుచ్ఛేదమునకు సంబంధించిన 1955 లో పారితమైన నాల్గవ సవరణ, సార్వజనిక ప్రయోజనము నిమిత్తమై ఆర్జించిన ఆస్తికై దాని హక్కుదారులకు ఇవ్వవలసిన నష్టపరిహారపు మొత్తము విషయమై ప్రభుత్వమునకు యుక్తాయుక్త విచారణ చేయుటకు వీలిచ్చినది. ఈ మార్పు ఫలితముగా సార్వజనిక ప్రయోజనము నిమిత్తము బలవంతముగా ఆర్జింపబడిన ఆస్తికై దాని హక్కుదారులకు చెందవలసిన నష్ట పరిహారము సరిపోయినదా లేదా యను ప్రశ్నపై న్యాయస్థానములకు క్షేత్రాధికారము లేకుండ పోయినది.

ఇపుడీ విషయమును నిర్ణయించునవి న్యాయస్థానములు కావు, పార్లమెంటున్ను రాజ్యముల విధానమండలులు మాత్రమే.

1955 సంవత్సరములోనే పారితమైన మరియొక సవరణమూలమున మాటల మార్పుతో వ్రాయబడిన 305 వ అనుచ్ఛేదము పాతఅనుచ్ఛేదమునకు బదులుగా ఏర్పాటు చేయడమైనది. అది రాజ్య ప్రభుత్వములు తాము స్వయముగా పూనుకొనదలచుకొన్న ఏదైన వర్తక, వ్యాపారములందు ఏకాధికార వ్యాపారము (మొనోపొలీ) ను సాగించుటకు వీలిచ్చుచున్నది. ఇది కూడ ఉచ్చతమ న్యాయాలయము చెప్పిన తీర్పు ప్రభావమును తుదముట్టించుటకై పారితమైనదే. ఉత్తరప్రదేశ్ రాజ్యమునకు, సాఖీరు అహ్మదునకు జరిగిన దావాలో రాజ్యము (పాత అనుచ్ఛేదము ప్రకారము) ఏ వర్తక వ్యాపారమందైనను ఏకాధికార వ్యాపారము చేయరాదు. ఎందుకనగా, సంవిధాన మందలి పాత అనుచ్ఛేదములో హామీ ఇవ్వబడిన వర్తక, వ్యాపారస్వేచ్ఛకు ఇట్టి గుత్తవ్యాపారము (మొనోపొలీ) విరుద్ధమైనది.

## రాజనీతియొక్క నిదేశ సూత్రములు

సంవిధానమందు హామీయివ్వబడిన మూలాధికారముల స్వరూపవర్ణనచేసిన వెనువెంటనే 'రాజనీతి

రొక్క నిదేశ సూత్రము'లను శీర్షికతో ఒక అధ్యాయము సంవిధానమందున్నది. ఈ సూత్రములను ఏ న్యాయస్థానమందును నిర్బంధముగ అమలుజరుపుటకు వీలులేదు. ఈసూత్రముల వివరణ ప్రారంభదశయందే, దాని ప్రవేశపెట్టుచున్న 57 వ విభాగము 'ఏ న్యాయస్థానమందును ఈ భాగములోని ఉపబంధనలను నిర్బంధించరాదు' అని చెప్పుచున్నది. అయినను సూత్రములు మాత్రము మూలాధారములేయని స్పష్టపరచుచున్నది. విధులను చేయుటలో ఈ సూత్రములను ప్రయోగించుట రాష్ట్రముయొక్క కర్తవ్యమని యాదేశించుచున్నది.

ఈ సూత్రములు, మద్యనిషేధము పంచాయతులు, విద్యావ్యాప్తి, కార్మికుల కనీసవేతనములు, ప్రాచీన కట్టడముల సంరక్షణ, దేశవ్యాప్తమైన ఒకే సివిల్ కోడ్ మొదలైనవాటికి చెందినవి. ఇవన్నియు పౌరులందరి క్షేమమునకై ఏర్పరుపబడినవి.

## సంవిధానము నెడల పౌరుని కర్తవ్యములు

పౌరుల కర్తవ్యములను సంవిధానమందు పేర్కొనరాదనుట నిజమేయైనను, పౌరుడు వాటియెడ శ్రద్ధవహించవలసి యున్నది. ఎందుకనగా: సంవిధానములో చేర్చబడియున్న అధికారములకు సంస్థలకు నిశ్చయమైన రక్షణనిచ్చునవి ఈ కర్తవ్య

ములు, వాటి ఆచరణ. ఒక రాష్ట్రమును సజీవముగాను, చైతన్యము కలదిగాను ఉంచునది పౌరులు తమ కర్తవ్యములను ఫలప్రదముగా నిర్వహించుటే. కుటుంబము యొక్క పెద్ద, తండ్రిగాని తల్లిగాని, కుటుంబమునకై పాటుపడి, పిల్లల భోజననిమిత్తమును, క్రమపద్ధతిని పెంపకమునకును ఏర్పాట్లు చేసినపుడే, వారు సక్రమ జీవనమునకును, శిక్షణకును అలవాటుపడిన పౌరులను తయారు కాగల్గుదురు. రాజ్యము నెడల, దాని విధుల యెడలను విధేయత చేతను, రాజ్యభక్తి చేతనే వారు రాష్ట్రజీవితమును బలపరచగలరు.

పౌరుని కర్తవ్యము లన్నింటిలోను సంవిధానమును నిలబెట్టుటే అత్యంతము గొప్పది. ఎందుకనగా, రాష్ట్రజీవితమునకు అది మూలాధారము, బలమున్నూ. రాష్ట్రజీవితమనగా స్వేచ్ఛగల ప్రజలు, స్వతంత్ర రాజ్యములో స్వేచ్ఛగా జీవించుట అన్నమాట.

ఇండియా సంవిధానము న్యాయస్థానముల రక్షణలో నుంచబడిన దనుట వాస్తవమే. దేశమునకు ప్రాతినిధ్యము వహించిన విధానమండలులు, తామేర్పడియున్న ప్రభుత్వములు ఈ సంవిధానమందలి సూత్రములను చక్కగా పాటించుచున్నారో లేదో చూడవలసియున్న దనుటయు నిజమే. అయితే న్యాయస్థానములు ఎవరైనగాని తమ ప్రయోజనముల

నిమిత్తముగాని నష్టపడి సంవిధానము నుల్లంఘించినట్లు ఆరోపణ చేసి ప్రభుత్వముపై ఫలానా కేసులను తమ సమక్షమునకు తెచ్చినపుడే కాని చర్యతీసికొనవు అట్టి ఉల్లంఘనలు ఎంత దురంతమైనవి అయినను, ఎవరైన తగిన శ్రద్ధతీసికొని ఈ ఉల్లంఘనలను న్యాయస్థానముల దృష్టిలోనికి తెచ్చి వాటికి పరిష్కారములు కోరినకాని న్యాయస్థానములు వాటివైపు చూడనైన చూడవు. ఈ విషయములో విధానమండలులలోని మన ప్రతినిధులు కూడ తమ కర్తవ్యములయెడ అశ్రద్ధగాను, అలక్ష్యము గాను ఉండవచ్చును.

న్యాయస్థానపు క్షేత్రాధికారముల వలనను మన ప్రతినిధులగు విధానమండలుల కర్తవ్యములవల నను లభించు కాపుదలలేగాక, ఈ కాపుదలల లోటు పాటులను భర్తీచేయుటకు వీటన్నింటికి అదనముగా సంవిధానమును దాని సూత్రములను పోషించు నిమిత్తము పౌరుడు జాగ్రత వహించవలసియున్నది. సంవిధానమునకు వాస్తవమైన రక్షణ పౌరుడు మేల్కొని యుండుటే. 'ఆద్యంతము లేని పరాకాష్ఠయే స్వేచ్ఛా ప్రాప్తికి మూల్యము' అని పురాతన వాక్కు కలదు. అట్టి నిరంతరమైన పరాకాష్ఠనే పౌరుడు వహించ వలెను. వ్యక్తిగతముగాగాని లేక పౌరసంఘములుగా లేక సివిలు స్వేచ్ఛల సమాజములుగా ఏర్పడిగాని,

అతడు సంవిధానమును కాపలికుక్కవలె కాపాడవలెను. సంవిధానమందు అతనికి హామీయివ్వబడిన అధికారములకు భంగపాటు కించిత్తైనను కల్గినదేమో అని చూచుచుండవలెను. నేరస్థుడు సాధారణ వ్యక్తిగాని, పురపాలక సంఘము లేక కమీషనరుగాని, జిల్లాబోర్డు గాని, రాజ్యప్రభుత్వము లేక పదాధికారి గాని, కేంద్రప్రభుత్వము లేక ఉద్యోగిగాని — ఎవరైనను సరియే పౌరుడు ఉపేక్షించరాదు. వార్తాపత్రికలకు వ్రాసిగాని, అసమ్మతి దృఢముగా తెలియచేయు సార్వజనిక సభల చేసిగాని, బహిరంగ ప్రదర్శనముల నేర్పాటు కావించిగాని, అతడు వ్యక్తిగతముగానో, లేక యితరులతో కలిసి సంఘరూపముగానో సంవిధానము యొక్క ఏ కొలది ఉల్లంఘనమైనను అందుకు సంబంధించిన ప్రభుత్వముల యొక్కయు ప్రజాసామాన్యము యొక్కయు సమక్షమునకు తేవలయును. ఇట్టి అనంగీకారపు ప్రకటనవలన ఉపయోగము లేనియెడల, అతడు విధానమండలి యందలి తనప్రతినిధిని ఈ విషయమందు జోక్యము కలుగజేసికొన వలసినదని, తగిన చర్య తీసుకొనుమని ఒత్తిడి తేవలయును. ఇట్టి అధికారమును చెలాయించుటకు అతడు విధానమండలి ఎన్నికలలో చురుకుగా పాల్గొనవలెను. అందులకుగాను వోటరుగా నమోదై, ఎన్నికలలో ఓటు వేయవలెను.

ఇట్టి సంవిధాన బద్ధమైన ఆందోళనా పద్ధతులు విఫలమైనపుడు, అతడా విషయమును న్యాయస్థాన సమక్షమునకు తీసికొనిపోవుటకు సంసిద్ధుడు కావలయును. అయితే, అతనికి తానే సంవిధానపు దావాను ఉచ్చ న్యాయాలయమునకు లేక ఉచ్చతమ న్యాయాలయము నకు కొనిపోవుటకు కావలసిన ఖర్చు భరించుశక్తి లేక పోవచ్చును. అట్టియెడ, ఈ కార్యము నతడు సుసంఘటితమైన ఒక రాకీజయ పక్షములో సభ్యుడై గాని, లేక ధన సంపత్తిగల ఏ పౌర సమాజములోనో, సివిలు స్వేచ్ఛల సంఘములోనో సభ్యుడై సాధించగలడు. ఆంగ్లేయుల స్వేచ్ఛల కాపాడుటకై పోరాడిన గొప్ప ఆంగ్ల పౌరులయొక్క ఉత్తేజకరములగు ఉదాహరణ లెన్నియో అతనిముందున్నవి. 1637 సంవత్సరములో ఓడల పన్నును పార్లమెంటు మంజూరు చేయ లేదను కారణమున దానిని కట్టుటకు సమ్మతింపక, అందునిమిత్తమై కారాగారమున కేగిన హాంప్డెన్, తను ప్రభుత్వమును ఖండించుచు వ్రాసిన వ్యాసము నకై సాధారణ వారంటుద్వారా ఎరెస్టు చేయబడగా అట్టి సాధారణ వారంట్లు న్యాయవిరుద్ధములనియు, తను పార్లమెంటు మెంబరుగా అనుభవించుచున్న సివిలు చర్య స్వేచ్ఛ, ఎరెస్టు మొదలైన విశేషాధికారము లకు అప్పటి తన ఎరెస్టు ప్రతికూలముగానున్నదనియు

వాదించిన జాన్ విల్క్స్; శతాబ్దములుగా కాథలిక్కులు మోయుచున్న రాజకీయ భారములనుండి వారిని విముక్తుల చేయుటకై పోరాడిన డానియల్ ఓకొనెల్ మున్నగు ప్రముఖులు పౌరునకు చిరస్మరణీయులు. ఇంక బాలగంగాధర తిలక్, మహాత్మాగాంధీ, జవహర్ లాల్ నెహ్రూ మున్నగు ఇండియా దేశభక్తుల ఉత్కృష్టమైన ఉదాహరణలున్నవి. ఏవి తమ అధికారములని వారు తలంచిరో వాటిని సాధించునిమిత్తము వ్రాయుటకు, మాట్లాడుటకు, పనిచేయుటకు పౌరునికిగల హక్కును రక్షించుటకై, ఈ మహనీయులు జైలుకు పోవుటకు సంసిద్ధులైరి. వీరందరి చరిత్ర యీనాటి ఇండియా పౌరుని, సంవిధానములో అతనికి హామీ యివ్వబడిన అధికారముల, స్వేచ్ఛల రక్షణకొరకు నలుగురిని కూడకట్టుకొని పనిచేయుటకై ఉత్సాహపరచి తీరును.

సంవిధానము నిజముగా పౌరునిదే; సంవిధానము పేరిట ఏర్పడి, పనిచేయుచున్న ప్రభుత్వములు కూడ అతనివే. అవన్నియు సజీవములై అతని క్షేమమునకై సహకరించునో లేదో అన్న విషయము అతని మీదను, అతని వైఖరులమీదను ఆధారపడియున్నది. కేవలము, సంవిధానము అతనికొరకై ఏవో కొన్ని అధికారములను, స్వేచ్ఛలను ఏర్పాటుచేసినవి కనుక

అవన్నియు తనలాభముకొరకు పాటుపడునని తృప్తిపడి కూర్చొనరాదు. ఈ అధికారములు దుర్వినియోగము కాకుండ, వాటినిగూర్చి అతఁడు దృఢముగా వాకుచ్చి వాటిని ఉపయోగించి, పరిరక్షించి కాపాడుకొనవలెను.

స్వపరిపాలన, స్వాతంత్ర్యము అను ప్రయోజనములకై నిర్మించిన సంస్థలు తన బాగుకొరకు పనిచేయవలసియున్న యెడల అవి అట్లు ఒనర్చునట్లు అతడు జాగ్రతపడవలెను. అతని ప్రతినిధులైన విధానమండలులు మంచి, యోగ్యులైన ప్రతినిధులతో నిండియుండవలెనన్న, అతను కష్టించి మంచి, యోగ్యులైన ప్రతినిధులు ఈ విధానమండలులకు ఎన్నుకొనబడునట్లు చూడవలెను. ఈ ప్రతినిధులు విధానమండలులలో వారి కర్తవ్యములను నెరవేర్చవలెనన్న, వారి నచటికంపిన ప్రజలు వారి వ్యాసంగములపై కన్ను వేసియుంచవలెను. వారు విధానమండలులలో తమ కర్తవ్యములను నెరవేర్చునట్లు చూడవలెను. దేశము యొక్క విధానమండలులకు ఎన్నుకొనబడిన గౌరవము దక్కినందుకు సదస్యులు తిరిగి ప్రత్యుపకారము చేయునట్లు జాగ్రతపడవలెను. పౌరులు విధానమండలులలోని తమ ప్రతినిధులతో ఉత్తర ప్రత్యుత్తరములు సల్పుచుండవలెను. వారికి తమ అక్కరలగూర్చి, కష్టములగూర్చి వ్రాయుచుండవలెను. సోమరులుగా

నున్నపుడు వారిని మందలింపవలెను; మంచి చేయు చున్నపుడు వారిని మెచ్చుకొనవలెను. తత్ఫలితముగా వారు మున్ముందు శ్రేష్ఠతరముగా పని చేయుదురు. ఈ ప్రతినిధులు విధానమండలులలో చేసిన కార్యముల గూర్చిన సారమును సంగ్రహముగా తమ నియోజక వర్గములలో ఏర్పాటు చేసిన బహిరంగసభలలో చెప్పు డని వారిని కోరవలెను.

విధానమండలుల సదస్యులకును, వారి నియోజకవర్గప్రజలకును నిరంతర సంబంధ బాంధవ్యములుండుట ప్రాతినిధ్య ప్రభుత్వ క్షేమ, సామర్థ్యముల నిమిత్తమై ఆవశ్యకమైనది. ఆక్టన్ ప్రభువు చెప్పినట్లు "సివిలు, క్రిమినలు సంహితముల పోషణ రాజ్యము యొక్క కర్తవ్యమై యుండగా, సార్వజనిక సంవిధాన విధిని స్థాపించుట జాతియొక్క కర్తవ్యము; ఏరాష్ట్రమున విధి (లా) దొంగను శిక్షించుటకు శక్తిహీనమై యుండునో, ఎచట సంఘము ప్రభుత్వముయొక్క చర్యను అరికట్టలేకయున్నదో, అట్టి రాష్ట్రము రాజకీయ వ్యవస్థ అను భావమునకే విరుద్ధముగా నుండును. మొదటి సందర్భములో అరాచకము సంప్రాప్తమగును. రెండవదానిలో నిరంకుశత్వము."

## ప్రొఫెసర్ రత్నస్వామి

ఆచార్య రత్నస్వామిగారి ఈ గ్రంథం పాండిత్యపుష్కలమైన రచన. పౌరులధర్మాలకు ఇందులో కల్పించబడిన ప్రాధాన్యంవల్లనూ, రచనలోని స్వచ్ఛతవల్లనూ ఈ గ్రంథం సామాన్య పాఠకులకును కూడా ఆకర్షిస్తుంది. రాజ్యాంగంలోని ప్రధాన విషయాలు —అధికార విభజన, ప్రాథమిక హక్కులు, న్యాయశాఖా స్వాతంత్ర్యం, పార్లమెంటరీ ప్రభుత్వానికి పునాది అయిన ప్రజాసత్తాకం ఈ లాంటివి జాగ్రత్తగా వివరించబడినవి.

న్యాయ కళాశాలకు ప్రిన్సిపాలుగానూ, లెజిస్లేటివ్ కౌన్సిలుకు అధ్యక్షుడుగానూ, విశ్వవిద్యాలయానికి వైస్‌చాన్సలర్‌గానూ గడించిన అనుభవంవల్ల ఆచార్య రత్నస్వామి మన రాజకీయ సంస్థలనుగూర్చి నిష్పాక్షిక దృష్టిని అవలంబించగలిగారు. రాజ్యాంగములో వారికిగల అభినివేశం మిక్కిలి సార్థకమైంది.

అనువాదకులు శ్రీ ఎం. ఎస్. ప్రకాశరావు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్రోపన్యాసకులుగా ఉన్నారు. ఆంగ్లాంధ్ర భాషలలో పూర్ణపాండిత్యం కలవారు. కళా సాహిత్యములపైన చక్కని విమర్శకులు.

THE CITIZEN AND
THE CONSTITUTION –
PROF. RATNASWAMY

*

TRIVENI PUBLISHERS
MASULIPATAM
(ANDHRA PRADESH)